ANGANWADI VOICE MONTHLY

# అంగన్‌వాడి వాయిస్



స్వరం మీది - పోరాటం మాది

సామాజిక ప్రజా చైతన్య మాసపత్రిక

సంపుటి - 4 సంచిక - 8 అక్టోబరు - 2019 OCTOBER 2019 వెల : 20/-

పోషణ మాసోత్సవ ప్రత్యేక సంచిక

## పోషకాహారం తినడం జాతి అభివృద్ధికి ఫలం



KRSA101 M102

# అంగన్‌వాడి వాయిస్

స్వరం మీది - పోరాటం మాది

సామాజిక ప్రజా చైతన్య మాసపత్రిక


సంపుటి : 4 సంచిక : 8 | ఎడిటర్ : దుద్దె ఉదయభాస్కరరావు | అక్టోబరు 2019


## విషయ సూచిక







రిపోర్టర్స్ :

మేఘనా ఉదయ్

ఎస్. మహ్మద్ రఫీ

లీగల్ అడ్వయిజర్స్ :

వాసర్ల అమర శ్రీనివాస్, అడ్వకేట్

ఫోన్ : 94405 02230



EDITORIAL OFFICE :

Flot No. 201,
Guru Raghavendra Enclave,
Sunkaravari Thota,
ELURU - 534 001, W.G.Dt. A.P.,
Cell : 94401 41712

Email : anganwadivoice@gmail.com





OWNER, PRINTER, PUBLISHER AND EDITOR BY DUDDE UDAYABHASKARA RAO, PUBLISHED AT . D NO. 3B-2-51, AMBICA CENTER, WESTERN STREET, ELURU-534 001. W.G DIST., ANDHRA PRADESH. PRINTED AT PRASANTH FLEX PRINTERS, D NO 23A-6-7, SANKARAMATHAM ROAD, R.R. PET, ELURU-534002, W.G DIST., ANDHRA PRADESH RNI No.: APTEL 2016/71924



సంపాదకీయం

# పర్యా'మరణం'

మృత్యుపాశాలు విసురుతున్నా కాలుష్య భూతం ప్రపంచ వ్యాప్తంగా లక్షల మంది ప్రాణాల్ని కర్కశంగా కబళిస్తోంది. ఈ అర్ధాంతర మరణాల్లో సగానికి పైగా చైనా, ఇండియాలోనే సంభవి స్తున్నాయి. వాయు కాలుష్యం, నీటి కాలుష్యం, శబ్ద కాలుష్యం ఇలా సమస్త ప్రపంచం, ప్రకృతి మొత్తం కాలుష్య మయం. ఈ కాలుష్యానికి కారకులెవరు అని పరిశీలిస్తే ముమ్మాటికీ మనమే. నేటి పర్యావరణ కాలుష్యానికి కారణం ఒకే ఒక్క జీవి మాత్రమే అదే మానవుడు. గతంలో భూమి, గాలి, నీరు, ఆకాశం, నిప్పులను పంచభూతాలుగా ఆరాధించేవారు. పంచభూతాలు మిళితమైన ప్రకృతిని ఆరాధించినందుకే వర్షాలు, పంటలు సమృద్ధిగా ఉండేవి. ప్రకృతిని, పర్యావరణాన్ని జీవితంలో ఒక భాగమని భావించేవారు. ప్రకృతిపై మానవుడు ఆధిపత్యం కోసం చేస్తున్న అనాలోచిత చర్యల వల్లనే నేటి భూ ఉష్ణోగ్రత పెరగటం, వాతా వరణంలో ఆకస్మిక మార్పులు, సునామీలు, వరదలు, కరువులు తరుచుగా ఏర్పడుతున్నాయి. జనాభా పెరగడం వల్ల వారి ఆవా సాల కోసం, అవసరాల కోసం ఇతరములైన అవసరాలు కోసం అడవులను నాశనం చేస్తు న్నారు. ఎక్కువ శాతం ప్రకృతి సంపద అడవులలో ఉందనే విషయాన్ని మరచిపోతున్నాము. క్రమంగా పచ్చని పరిసరాలకు దూరం అవుతున్నాం. కాంక్రీటు అరణ్యాలను శరణజొచ్చుతున్నాం. కాలుష్యకాసారాల్లో మునిగిపోతున్నాము. దీంతో ఎన్నెన్నో సమస్యలకు, జబ్బులకు చేజేతులా 'కొని' తెచ్చుకుంటున్నాం. రోజురోజుకీ పట్టణీకరణ, కాలుష్యం పెరిగిపోతున్న ప్రస్తుత తరుణంలో ఇది మరింత ప్రాధాన్యాన్ని సంతరించుకుంది కూడా. నేటి ఉరుకులు, పరుగుల జీవితం మోసుకొస్తున్న పలు సమస్యలను పచ్చని ప్రకృతి సహజపరిష్కార మార్గం కాగలదు. ప్రపంచ శాస్త్రవేత్తలు జరిపిన పరిశోధనలలో కూడా కాలుష్యం వల్ల భూగోళానికి ముప్పు వాటిల్లబోతుందని తేల్చారు. కాలుష్యాన్ని తగ్గించటానికి తక్షణ చర్యలు ప్రారంభించకపోతే మానవ మను గడకు, మన భూతలం, మన భవిష్యత్తుతరాలు ప్రమాదానికి గురికాక తప్పదు. విచక్షణా రహితంగా ప్రకృతి ప్రసాదించిన వనరులను వాడుకోవ దం వల్లే, వాతావరణంలోని సమతుల్యత దెబ్బతినడం మన ముందున్న నిష్ఠూర సత్యం. పర్యావరణం దెబ్బ తింటే భవిష్యత్ అంధకారమవుతుంది. పర్యావరణాన్ని పాడుచేసే కాలుష్యాల్లో ప్రధానమైంది, ఎక్కువ హాని కల్గించేది ప్లాస్టిక్. మానవుని జీవితం ప్లాస్టిక్ వస్తువులతో ముడిపడివుంది. ఉదయం లేచింది మొదలు రాత్రి పడుకునే వరకు ప్లాస్టిక్ వస్తువుల తోనే ఉంటాడు. వీటి వాడకం వల్ల చాలా ప్రమాదాలు పొంచి ఉన్నా యని తెలిసినా వీటిని ఉపయోగించకుండా ఉండలేకపోతు న్నాము. ప్రజారోగ్యం పర్యావరణాల పరిరక్షణ పెరుగుదల ప్రజా ప్రభుత్వాలు బాధ్యతేనని సర్వోన్నత న్యాయస్థానం గతంలో ఉద్భోదించింది. దీనితో కాలుష్య నియంత్రణ మండలి అనేకానేక కార్యక్రమాలు చేస్తుంది గానీ ఆశించిన స్థాయిలో ఫలితాలు రావటం లేదు. ప్లాస్టిక్ స్థానంలో ప్రత్యామ్నాయం నిమిత్తం ఇటీవల ప్రభుత్వం తీవ్రంగా స్పందిస్తోంది. వాస్తవానికి ప్లాస్టిక్ రహిత ప్రపంచాన్ని ఊహించలేం. అయినప్పటికీ ప్లాస్టిక్‌ను నిషేధించాలనే సంకల్పంతో అడుగులు ముందుకు వేస్తోంది ప్రభుత్వం. ఈ ప్రయత్నాలు ఎంతవరకు ఫలభరితం అవుతుందో వేచి చూడాలి. 1987లో భారత ప్రభుత్వం పర్యావరణ పరి రక్షణపై సమగ్రమైన జాతీయ విధా నాన్ని రూపొందించటం జరిగింది. ఇదికాక 1974 కాలుష్య నియంత్రణ చట్టం, 1986 పర్యావరణ రక్షణ చట్టం, 1999 వ్యర్థ పదార్థాల నిర్వహణ నియమాలు, 1980 అటవీ చట్టం, 1972 వన్యప్రాణి చట్టం, 1998 జాతీయ పర్యావరణ అప్పిలేట్ అథారిటీ చట్టం వంటివి ఎన్ని ఉన్నా అవి రూపొం దించిన ఉద్దేశ్యం మాత్రం నేటికి నెరవేరటం లేదు. ఇప్పటికైనా స్వచ్ఛమైన గాలికి చెట్లను రక్షించుకుందాం. చెట్టు చేమ జగతికి ముద్దని చాటుదాం. నీటి వనరులను రక్షించుకుందాం, నీరు కాలుష్యం కాకుండా చూసుకొందాం, పుడమితల్లి అందాలు తరిగిపోకుండా చూసుకుందాం. పర్యావరణాన్ని కాపాడుకుందాం!

ఉదయభానురెడ్డి

అంగన్‌వాడి
వాయిస్
సామాజిక ప్రజా చైతన్య మాసపత్రిక

అక్టోబరు 2019

# అంగన్‌వాడీ కేంద్రాల స్థితిగతులపై నివేదికివ్వండి

## మహిళల ఆరోగ్యంపై ప్రత్యేక దృష్టి పెట్టండి

## టెక్నాలజీ పేరుతో లబ్దిదారులను నిరాకరించొద్దు

## మహిళా శిశు సంక్షేమశాఖపై సిఎం జగన్ సమీక్షా సమావేశం





రాష్ట్రంలో ఉన్న అంగన్‌వాడీ కేంద్రాల పనితీరు వాటి స్థితి గతులపై ఒక నివేదిక అందించాలని రాష్ట్ర ముఖ్యమంత్రి వైఎస్ జగన్మోహనరెడ్డి అధికారులను ఆదేశించారు. ఇటీవల గుంటూరు జిల్లా తాడేపల్లిలోని క్యాంపు కార్యాలయంలో మహిళా శిశు సంక్షేమశాఖపై సమీక్షా సమావేశం నిర్వహించారు. సంక్షేమ పథకాల అమలులో అధికారులకు సిఎం మార్గనిర్దేశం చేసారు. సంక్షేమ పథకాల అమలులో అనుసరిస్తున్న విధానా లను, పథకాలను నిరాకరించేలా ఉండకూడదని జగన్మోహనరెడ్డి స్పష్టం చేసారు. పథకాలు సంతృప్తికరస్థాయిలో లబ్దిదారులకు అందించటానికే ఈ విధానాలు అన్న విషయాన్ని గుర్తు చేసుకోవాలని సూచించారు. టెక్నాలజీ పేరుతో ప్రభుత్వ సంక్షేమ పథకాలను లబ్దిదారులకు నిరాకరించే విధానాలు చేపట్టవద్దని మరీ చెప్పారు. బయోమెట్రిక్, ఐరీష్, వీడియో స్క్రీనింగ్‌తో లబ్దిదారులకు ఇబ్బంది ఎదురవ్వకుండా చర్యలు చేపట్టాలన్నారు. ప్రభుత్వం ఎంతో ప్రతిష్టాత్మకంగా చేపట్టిన గ్రామ సచివాల యంలో అవసరాల కొరకు హెల్ప్‌లైన్ ఏర్పాటు చేయాలని సిఎం నిర్ణయించారు. గ్రామాల నుంచి వస్తున్న అత్యవసర విషయాలపై ప్రభుత్వ యంత్రాంగం స్పందించటానికి ప్రత్యేక మెకానిజం ఉండాలని సిఎం సూచించారు. గ్రామ సచివాల యాల్లో మహిళా పోలీసు సహకారాన్ని తీసుకోవాలన్నారు. 1008 కేసుల్లో వేధింపులకు గురైన మహిళలకు ఇవ్వాల్సిన పరిహారం రూ. 7.48 కోట్లను గత ప్రభుత్వం పెండింగ్‌లో ఉంచిన విషయాన్ని అధికారులు సిఎం దృష్టికి తీసుకురావ టంతో వెంటనే నిధులు విడుదల చేయటానికి తగిన చర్యలు తీసుకోవాలని జగన్ ఆదేశించారు. ఇదే సమయంలో వివిధ ఘటనల్లో బాధితులకు సహాయం చేయటానికి జిల్లా కలెక్టర్‌కి కోటి రూపాయలు చొప్పున నిధి కేటాయించాలని సిఎం నిర్ణ యించారు. నిధి ఖర్చు అవుతున్న కొద్దీ కోటి రూపాయలకు తగ్గకుండా నిల్వ వుండేలా వారం రోజుల్లో మళ్ళీ మంజూరు చేయాలన్నారు. మహిళల్లో రక్తహీనత సమస్య ఎక్కువ వుందని అధికారులు సిఎం దృష్టికి తీసుకువచ్చారు. దీనిపై ఆయన తీవ్రంగా స్పందించి నివారణ చర్యలను చేపట్టాలని ఆదేశిం చారు. టెస్ట్, ట్రీట్, టాక్ విధానంలో ఈ రక్తహీనతను అధిగ మించే చర్యలు తీసుకుంటామని అధికారులు తెలిపారు. రక్త హీనత ఉన్న మహిళలను గుర్తించేందుకు అవసరమైన పరీక్షలు నిర్వహించి తగిన చికిత్స అందించటంతోపాటు రక్తహీనత నివారణకు తీసుకోవాల్సిన జాగ్రత్తలపై అవగాహన కల్పిస్తున్నట్లు సిఎంకి వివరించారు. ఆయనే పౌష్టికాహారంలో భాగంగా గర్భవతులకు ఏవిధమైన ఆహారం ఇస్తున్నారని సిఎం అడిగి తెలుసుకున్నారు. రోజుకి రూ. 22.5లు ఖర్చు చేస్తున్నామని



అధికారులు ముఖ్యమంత్రికి చెప్పారు. మరింత నాణ్యమైన పౌష్టికాహారాన్ని అందించటంపై దృష్టి పెట్టాలని సిఎం వైఎస్ జగన్ ఆదేశించారు. మహిళా శిశు సంక్షేమంలో గ్రామ వాలం టీర్లకు భాగస్వామ్యం కల్పించాలన్నారు. మహిళల ఆరోగ్యంపై దృష్టి పెట్టాలని ఆదేశించారు. పిల్లలకు అందుతున్న భోజనం వారి సంరక్షణపై ఎప్పటికప్పుడు సమీక్ష చేయాలని దానికొరకు అంగన్‌వాడీ వర్కర్లను మోటివేట్ చేయాలన్నారు. అలాగే బాల్య వివాహాల నియంత్రణపై ప్రజలకు అవగాహన కల్పించాల న్నారు. గ్రామాల్లో బాల్యవివాహాల నివారణ కొరకు తగిన చర్యలు తీసుకోవాలని వైఎస్ జగన్ ఆదేశించారు. ప్రభుత్వ పాఠశాలల్లో చేపడుతున్న నాడు-నేడు తరహా కార్యక్రమాన్ని అంగన్‌వాడీల్లో చేయటానికి ప్రణాళిక సిద్ధం చేయాలన్నారు. సమావేశంలో మంత్రి తానేటి వనిత, ప్రిన్సిపల్ సెక్రటరీ దమ యంతి, డైరెక్టరు కృతికా శుక్లా, ఇతర అధికారులు పాల్గొన్నారు.

# పౌష్టికాహార లోపాన్ని అరికట్టండి

## మురికివాడలు, వలస జనాభాపై దృష్టి సారించాలి

## పోషణ్ అభియాన్‌లో భాగంగా రాష్ట్రాలకు కేంద్రం సూచన

**పౌ**ష్టికాహార లోపాన్ని నిరోధించేందుకు గట్టిగా కృషి చేయాలని కేంద్ర ప్రభుత్వం అన్ని రాష్ట్రాలకు సూచించింది. ముఖ్యంగా మురికివాడల్లో నివసిస్తున్నవారిలో పౌష్టికాహార లోపాన్ని నివారించే చర్యలు చేపట్టాలని, అలాగే వలస జనాభా అవసరాలను కూడా తీర్చాలని కేంద్రం స్పష్టం చేసింది. పౌష్టికా హార కల్పన కోసం కేంద్ర ప్రభుత్వం చేపట్టిన 'పోషణ్ అభి యాన్'లో భాగంగా ఈ చర్యలు చేపట్టాలని కోరింది. నెల రోజుల పాటు ఈ కార్యక్రమం అమలవుతుంది. పట్టణ ప్రాంతాల్లో పౌష్టికాహార లోపానికి ప్రధాన కారణం పేదల జనాభా పెరగడం, సురక్షిత ఆహారం లేకపోవడం, అనారోగ్యకర వాతావరణ ప్రబలడమేనని కేంద్రం తెలిపింది. పట్టణాల్లో వలస జనాభా, మురికివాడల్లో నివసించేవారికి ఆరోగ్య, పౌష్టికాహార సేవలను అందుబాటులోకి తేవాలని రాష్ట్రాలను కోరింది. ఈ మేరకు రాష్ట్రాలో పాటు జిల్లా అధికారులకు కూడా కేంద్ర ప్రభుత్వం ఓ నోట్ పంపింది. పోషణ్ అభియాన్‌లో భాగంగా పట్టణ ప్రాంతాల్లో తగిన చర్యలు చేపట్టాలని సూచించింది. ఇందుకు రాష్ట్ర, జిల్లా, బ్లాక్ స్థాయి అధికారులు బాధ్యత వహిం చాలని కేంద్రం స్పష్టం చేసింది. ముఖ్యంగా వలస జనాభా, మురికివాడల్లో నివసిస్తున్న వారిపై ప్రత్యేక దృష్టి సారించాలని కోరింది. అన్ని విభాగాలు, పట్టణ ఆరోగ్య మిషన్ల మధ్య సమన్వ యం సాధించాలని, స్వచ్ఛభారత్ సందేశాన్ని బలంగా వ్యాపింప జేయాలని కోరింది. ప్రతి ఒక్కరికీ పోషణ అభియాన్ గురించి అవగాహన కలిగేలా చర్యలు చేపట్టాలని సూచించింది. అలాగే పట్టణ ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను అభివృద్ధి చేయాలని, అలాగే అనీమియా శిబిరాలను కూడా నిర్వహించాలని రాష్ట్రా లను కోరింది. ముఖ్యంగా పట్టణాల్లోని మురికివాడల్లో పోషణ్ అభియాన్ గురించి ఇంటింటికీ ప్రచారం చేయాల్సిన అవసరం ఉందని కేంద్రం స్పష్టం చేసింది.

### పాఠకులకు గమనిక

"అంగన్‌వాడీ వాయిస్" సామాజిక ప్రజాచైతన్య మాసపత్రిక ప్రియ పాఠకులందరికి నమస్సు మాంజలి. పత్రిక క్రమంగా పొందుతున్న మీరంతా పత్రికపై మీ స్పందన తెలియచేయాలని కోరుతున్నాం. పత్రిక నిర్వహణ ఏ విధంగా ఉంటే బాగుంటుంది, పత్రికలో వచ్చే శీర్షికలు, కథనాలు, వార్తలు మీకు ఉపయోగకరంగా ఉంటు న్నాయా? దయచేసి క్రమం తప్పకుండా ప్రతినెల 'అంగన్‌వాడీ వాయిస్' చదువుతున్న మీరు పత్రికపై మీ అభిప్రాయాన్ని, స్పందనను తెలియచేయండి. ఉత్తమ సలహాలను పత్రికలో మీ పేరుతో ప్రచురిస్తాం. వెంటనే పత్రికపై మీ సూచనలు, సలహాలు, స్పందన, ప్రతిస్పందన తెలియజేయగలరు.

– ఎడిటర్

# అంగన్‌వాడీ కేంద్రాలకు అన్ని సదుపాయాలు కల్పించండి

## - ప॥గో॥ జిల్లా కలెక్టర్ ముత్యాలరాజు

జిల్లాలోని అన్ని అంగన్‌వాడీ కేంద్రాలలో మరుగుదొడ్లు, విద్యుత్ సరఫరా సదుపాయాలు తప్పనిసరిగా కల్పించాలని జిల్లా కలెక్టర్ ఆర్. ముత్యాలరాజు అధికారులను ఆదేశించారు. పశ్చిమగోదావరి జిల్లా ఏలూరులోని కలెక్టరేట్ మినీ మీటింగ్ హాలులో జిల్లా కలెక్టర్ ముత్యాలరాజు స్త్రీ, శిశు సంక్షేమ శాఖ అధికారులతో సమావేశం నిర్వహించి జిల్లాలోని ఐసిడిఎస్ ప్రాజెక్టులలో అమలవుతున్న కార్యక్రమాల వారాంతపు సమీక్ష నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ జిల్లాలోని అన్ని అంగన్‌వాడీ కేంద్రాలలో నూరు శాతం మరుగుదొడ్ల సదుపాయం కల్పించేందుకు ఇంకా 271మరుగుదొడ్లు నిర్మించాల్సి ఉందని, ఈ పనుల మంజూరు కొరకు ప్రతిపాదనలు సమర్పించాలని ఐసిడిఎస్ పిడిని ఆదేశించారు. 571 అంగన్‌వాడీ కేంద్రాలకు విద్యుత్ సరఫరా కల్పించాల్సి ఉందని, ఇందుకు ఆయా పంచాయతీల ద్వారా కనెక్షన్ రుసుము చెక్కులు సేకరించి సరఫరా నిమిత్తం వెంటనే ట్రాన్స్‌కోకు పంపాలన్నారు. అన్ని అంగన్‌వాడీ కేంద్రాలలో బరువు తూచే మిషన్లు తప్పక ఉండాలని, పనిచేయని స్థితిలో ఉన్న 2482 మిషన్ల స్థానంలో



క్రొత్త మిషన్ల కొనుగోలుకు చర్యలు చేపట్టాలన్నారు. గర్భిణులు, బాలింతలు, యుక్తవయసు ఆడపిల్లలు, 6 ఏళ్లలోపు చిన్నారులకు పోషకాహారం, రక్తహీనత నివారణ, ఆరోగ్య పరిరక్షణ కొరకు కేంద్ర, ప్రభుత్వాలు అమలు చేస్తున్న కార్యక్రమాలు జిల్లాలో లక్ష్యిత ప్రజలందరికీ సమగ్రంగా చేరేలా పర్యవేక్షించేందుకు వారందరి సమాచార గ్రామ, వార్డు వాలంటర్లీ ద్వారా సెప్టెంబరు 23 నుండి మూడు రోజుల పాటు ఇంటింటి సందర్శన ద్వారా డేటా సేకరించి ఆన్‌లైన్‌లో అప్ చేయాలని ఆదేశించారు. ఐసిడిఎస్ పిడి కె.విజయకుమారి, సిడిపిఒలు పాల్గొన్నారు.

# పౌష్టికాహారంతో రక్తహీనత నివారణ

పౌష్టికాహారంతోనే రక్తహీనత నివారణ సాధ్యమని జిల్లా ఐసిడిఎస్ ప్రాజెక్టు డైరెక్టర్ సుఖజీవన్‌బాబు అన్నారు. బొమ్మూరులోని మహిళా ప్రాంగణంలో జిల్లాలోని సిడిపివోలతో పౌష్టికాహార మాసోత్సవాలపై ఆయన సమీక్షించారు. ఈ సందర్భంగా జీవన్‌బాబు మాట్లాడుతూ జిల్లాలోని అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా మెరుగైన సేవలు అందిస్తున్నామన్నారు. అంగన్‌వాడీ కేంద్రాల పరిధిలోని మహిళల్లో రక్తహీనత కేసులను తగ్గించేందుకు సిడిపివోలు, సూపర్‌వైజర్లు కృషి చేయాలన్నారు. బిడ్డ పుట్టినప్పటి నుంచి రెండేళ్ల వరకు జాగ్రత్తగా చూసుకోవాలని, అలా చూసుకోవడం ద్వారా బరువు, ఎత్తు,ఆరోగ్యంగా ఉంటాదన్నారు. ముందుగా ఐసిడిఎస్ సెక్టార్ల వారీగా పీడి జీవన్‌బాబు సమీక్ష జరిపారు. కార్యక్రమంలో డిసిపివో వెంకట్, సిడిపివోలు, సూపర్‌వైజర్లు పాల్గొన్నారు. పౌష్టికాహారంతో సంపూర్ణ ఆరోగ్యం సాధ్యమని రాజానగరం ఐసిడిఎస్ సిడిపివో వై.సువీలకుమారి అన్నారు. పౌష్టికాహార మాసోత్సవాలలో భాగంగా బొమ్మూరులోని జిపిఆర్ జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో కిశోర బాలిక



లకు అవగాహన కార్యక్రమం నిర్వహించారు. ఈ సందర్భంగా సిడిపివో మాట్లాడుతూ ప్రతి ఒక్కరూ పోషక విలువలతో కూడిన ఆహారం తీసుకోవాలన్నారు. పాఠశాల ప్రధానోపాధ్యాయుడు వై. నాగేశ్వరరావు మాట్లాడుతూ ఐసిడిఎస్ ద్వారా అందిస్తున్న సేవలను సద్వినియోగం చేసుకోవాలన్నారు. కిశోర బాలికలకు పౌష్టికాహారం, హ్యాండ్‌వాష్, పరిసరాల పరిశుభ్రతపై అవగాహన కల్పించారు. ముందుగా పాఠశాల విద్యార్థినులతో పౌష్టికాహార మాసోత్సవాల సందర్భంగా ర్యాలీ నిర్వహించారు. కార్యక్రమంలో అంగన్‌వాడీ సూపర్‌వైజర్ సత్యశ్రీ తదితరులు పాల్గొన్నారు.

# అభివృద్ధిని అందించే దసరా

- మహ్మద్ రఫీ

**ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి తొమ్మిది రోజులు దేవీ నవరాత్రులు. పదవ రోజు విజయదశమి కలిసి దసరా అంటారు. ఇది ముఖ్యంగా శక్తి ఆరాధనకు ప్రాధాన్యత ఇచ్చే పండుగ. ఈ పండుగకు నవరాత్రి, శరన్నవరాత్రి అని అంటారు. శరదృతువు ఆరంభంలో వచ్చే పండుగ కనుక ఈ పేరు వచ్చింది.**

దసరా పండుగల్లో మొదటి మూడు రోజులు పార్వతీదేవికి, తరువాతి మూడు రోజులు లక్ష్మీదేవికి, తర్వాతి మూడు రోజులు సరస్వతి దేవికి పూజలు నిర్వహిస్తారు. ఈ సమయంలో పూజలో విద్యార్థులు తమ పుస్తకాలను ఉంచుతారు. ఇలా చేస్తే విద్యాభ్యాసంలో విజయం లభిస్తుందని విశ్వసిస్తారు సామాన్యులే కాక యోగులు నవరాత్రులలో అమ్మవారిని పూజిస్తారు. ముఖ్యంగా శాక్తేయులు దీనిని ఆచరిస్తారు. బొమ్మల కొలువు పెట్టడం ఒక ఆనవాయితి. ఆలయాలలో అమ్మవారికి ఒక్కోరోజు ఒక్కో అలంకారం చేస్తారు. పదవ రోజు పార్వేట ఉంటుంది. ఈ రోజు ప్రజలు ఒక ప్రదేశంలో కూడి వేడుక జరుపుకుంటారు. జమ్మిచెట్టు ఉన్న ప్రదేశంలో పార్వేట చేయడం ఆనవాయితి.

దసరా పండుగ విజయదశమి నాడు జరుపుకోవడం జరుగుతుంది. తెలుగువారు దసరాని పది రోజులు జరుపుకుంటారు. తెలుగువారు దసరాని పది రోజులు జరుపుకుంటారు. ముందు నవరాత్రులు దుర్గపూజ ఉంటుంది. తెలంగాణాలో ఈ తొమ్మిది రోజులు అమావాస్య నుండి నవమి వరకు బతుకమ్మ ఆడుతారు. తెలంగాణా పల్లెల్లో ప్రతి అమావాస్యకి స్త్రీలు పట్టు పీతాంబరాలు ధరించడం ఆనవాయితి. విజయదశమి రోజున చరిత్ర ప్రకారం రాముడు రావణునిపై గెలిచిన సందర్భమే కాక, పాండవులు వనవాసం వెళ్తూ జమ్మిచెట్టుపై తమ ఆయుధాలను తిరిగి తీసిన రోజు. ఈ సందర్భంగా రావణవధ, జమ్మి ఆకుల పూజ చేయటం రివాజు. జగన్మాత అయిన దుర్గాదేవి, మహిషాసురడనే రాక్షసునితో తొమ్మిది రాత్రులు యుద్ధము చేసి అతనిని వధించి జయాన్ని పొందిన సందర్భమున 10వరోజు ప్రజలంతా సంతోషంతో పండుగ జరుపుకుంటారు. అదే విజయదశమి. దేవీ పూజా ప్రాధాన్యత ఈశాన్యభారతదేశంలో హెచ్చుగా ఉంటుంది.

## ఆయుధపూజ

అరణ్యవాసం పూర్తి చేసుకొని అజ్ఞాతవాసం చేసే సమయం ఆసన్నమైనప్పుడు పాండువులు తమ ఆయుధాలను పరులకంట పడకుండా జమ్మిచెట్టు మీద భద్రపరిచారు. అజ్ఞాతవాస ముగింపులో విజయదశమి నాడు పాండవ మధ్యముడు విజయుడు ఆయుధాలను బయటికి తీసి పూజ చేసి ఉత్తరగోగ్రహణ యుద్ధాన్ని చేసి దిగ్విజయుడైనాడు. కనుక ఆశ్వీయుజ శుద్ధ దశమి విజయదశమి అయింది. ఆరోజున దుర్గాదేవి, అర్జునుడు విజయం సాధించారు కనుక ప్రజలు తమకు జీవనాధారమైన వస్తువులకు కృతజ్ఞతా పూర్వకముగా పూజలు చేసి తమ జీవితం విజయవంతం కావాలని అమ్మవారిని వేడుకుంటారు. ఇదే ఆయుధపూజ. విద్యార్థులు పాఠ్యపుస్తకాలను, ఇతరులు తమ వృత్తికి సంబంధించిన పుస్తకాలను పూజలో పెట్టడం ఆనవాయితి. ఈ రోజు నూతనంగా విద్యార్థులు పాఠశాలలో ప్రవేశింపచేయడం, అక్షరాభ్యాసం చేయడం ఆచారాలలో ఒకటి. వ్యాపారులు కొత్త లెక్కలు ఈ రోజు నుండి ప్రారంభించడం కొన్ని ప్రదేశాలలో ఆచారం.



## మహిషాసురమర్ధిని

బ్రహ్మదేవుని వరాల వలన వరగర్వితుడైన మహిషాసురుడు దేవతల్తో ఘోరమైన యుద్ధము చేసి వారిని ఓడించి ఇంద్ర పదవిని చేపట్టాడు. దేవేంద్రుడు త్రిమూర్తులతో మొరపెట్టుకొనగా మహిషునిపై వారిలో రగిలిన క్రోదాగ్ని ప్రకాశవంతమైన తేజముగా మారింది. త్రిమూర్తుల తేజము కేంద్రీకృతమైన ఒక స్త్రీ రూపమై జన్మించింది. శివుని తేజము ముఖముగా, విష్ణు తేజము బాహువులుగా, బ్రహ్మతేజము పాదములుగా కలిగి మంగళమూర్తిగా అవతరించిన ఆమె 18 బాహువులను కలిగి



ఉంది. ఆమెకు శివుడు శూలమును, విష్ణువు చక్రమును, ఇంద్రుడు వజ్రాయుధమును, వరుణ దేవుడు పాశము, బ్రహ్మ దేవుడు అక్షరమాల, కమండలము హిమవంతుడు సింహమును వాహనంగాను ఇచ్చారు. ఇలా సర్వదేవతల ఆయుధములు సమకూర్చుకొని మహిషాసురుని తరపున పోరు సల్పుతున్న ఉదగ్రుడు, మహాహనుడు, అసిలోముడు, బాష్కలుడు, బిడాలుడు మొదలైన వారిని సంహరించిన తరువాత మహిషాసురునితో తలపడినది. ఈ యుద్ధములో ఆ దేవి వాహనమైన సింహమూ శత్రువులను చీల్చి చెండాడింది. దేవితో తలపడిన అసురుడు మహిషిరూపుడు గలవాడు. భీకరంగా సాగిన వారి రువుని పోరాటంలో తొమ్మిదిరోజుల సాగి చివరకు తొమ్మిదవ రోజున ఉగ్రరూపం దాల్చిన ఆ దేవి మహిషాసురుణ్ణి సంహరించడంతో ఆవిడ మహిషాసురమర్ధినిగా కీర్తింపబడింది. వసంతం తరువాత వచ్చేది అంటే చలికాలం. అది ముగిసిన వెంటనే ఎండాకాలం వస్తుంది. శరదృతువులో వర్షాకాలం ముగిసి చలికాలం మొదలవుతుంది. ఈ సమయంలో వాతా వరణంలో కలిగే మార్పులు అనేక రోగాలకు కారణమవుతాయి. అలా కాకుండా శక్తి ఆరాధన పేరుతో ప్రజలంతా శుచిగా శుభ్రంగా ఉంటే ఎలాంటి రోగాలూ దరిజేరవన్నది ఈ నవరాత్రి వేడుకల వెనుక వున్న శాస్త్రీయ కోణం. ఏదిఏమైనా లోకకళ్యాణానికి పూనుకొని విజయదశమి నాడు అమ్మవారు మహిషాసురుశ్రీనని అంతరింపచేయడంతో ఆనాటి నుండి నేటి వరకు ఆ మహిషాసురమర్ధినిని ప్రార్థించి విజయదశమినాడు తలపెట్టబడే ఏ కార్యక్రమమైనా సిద్ధిస్తుందని ప్రజల ప్రగాఢ విశ్వాసం.

# పౌష్టికాహార లోపంపై బ్రహ్మాస్త్రం

## దేశవ్యాప్తంగా చౌకదుకాణాల ద్వారా బలవర్ధక బియ్యం!

## పంపిణీకి సమాయత్తం : పశ్చిమలో ప్రయోగాత్మకంగా అమలు

పౌష్టికాహార లోపాన్ని అధిగమించడానికి కేంద్రం నవంబరు నుంచి బలవర్ధక బియ్యం (ఫోర్టిఫైడ్ రైస్) పథకానికి శ్రీకారం చుడుతోంది. ఆంధ్రప్రదేశ్‌లోని పశ్చిమగోదావరి సహా దేశ వ్యాప్తంగా 9 జిల్లాల్లో ఈ పథకాన్ని ప్రయోగాత్మకంగా అమలు చేయాలని కేంద్ర ఆహార, ప్రజాపంపిణీ వ్యవహారాల శాఖ నిర్ణయించింది. ఈ పథకాన్ని కేవలం 9 జిల్లాలకే పరిమితం చేయకుండా ఒకేసారి దేశవ్యాప్తంగా అమలు చేయడం మంచిదని నీతి అయోగ్ కేంద్ర ఆహార, ప్రజాపంపిణీ శాఖకు సూచించింది. ఈ ప్రతిపాదనకు కేంద్ర మంత్రివర్గం సరే అంటే, దేశవ్యాప్తంగా 50%కి పైగా బియ్యం వినియోగించే రాష్ట్రాల్లో ఒకేసారి అమలు అవుతుంది. లేదంటే తొలుత ఎంపిక చేసిన 9 జిల్లాల్లోనే మొదలు పెడతారు. దేశంలో 58.5% మంది పిల్లలు, 53% మంది మహిళలు, 22.7% మంది పురుషులు తీవ్ర రక్తహీన సమస్యతో బాధపడుతున్నారు. సాధారణంగా రోజువారీ తీసుకొనే ఆహారంలో 50-70% వరకు సూక్ష్మ పోషకాల కొరత ఉంటోంది. ఈ సమస్యను అధిగమించాలంటే బలవర్ధక ఆహారం ఇవ్వడం ఒక్కటే మార్గం అని తలచి ప్రభుత్వం 'ఫోర్టిఫైడ్ రైస్' స్కీంను తెరమీదికి తెచ్చింది. ఈ ప్రాజెక్టు కోసం కేంద్ర ఆహార, ప్రజాపంపిణీ శాఖ రూ.147.61కోట్లను బడ్జెట్‌లో కేటాయించింది. ప్రతి కేజీ బియ్యాన్ని బలవర్ధకంగా మార్చడానికి (ఫోర్టిఫై) 60 పైసలు ఖర్చవుతుందని కేంద్రం అంచనా వేసింది. ఈ భారాన్ని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు 75:25 నిష్పత్తిలో పంచుకోవాలని నిర్ణయించాయి. దేశంలో రక్తహీనత సమస్య అధికంగా ఉన్నందున ఈ ఫోర్టిఫైడ్ సమస్య అధికంగా ఉన్నందున ఈ ఫోర్టిఫైడ్ రైస్ ద్వారా ఇనుము, విటమిన్ బి12, ఫోలిక్ యాసిడ్‌లను జతచేసి ప్రజలకు అందుబాటులోకి తెస్తారు.

### ఫోర్టిఫికేషన్ ఎలా?

బియ్యం మిల్లుల్లో ఆడించేటప్పుడు వెలువడే నూకలను పిండిగా మారుస్తారు. అందులోకి శాస్త్రీయ పద్ధతిలో విటమిన్లు, పోషకాలను (మినరల్స్) మిశ్రమం చేస్తారు. తర్వాత ఆ మిశ్రమానికి తగిన ఆవిరి, నీరు, తేమ జత కలిపి ముద్దగా చేసి ఎండబెడతారు. తర్వాత యంత్రాల ద్వారా బియ్యం గింజల్లా విడగొడతారు. అనంతరం సాధారణ బియ్యంలో కలుపుతారు. ఈ ప్రక్రియ కోసం ఒక్కో మనిషికి రోజుకు 40పైసల నుంచి రూ. 1.3 వరకు ఖర్చవుతుందనేది అంచనా. కేంద్రం మధ్యే మార్గంగా 60 పైసలు అందించడానికి సిద్ధమైంది. ప్రతి వంద కేజీల సాధారణ బియ్యానికి ఒక కిలో బలవర్ధక బియ్యం కలుపుతారు. ఈ పథకం ద్వారా మిల్లుల్లో ఉత్పత్తి అయ్యే నూకలన్నింటినీ మిల్లర్లు ఫోర్టిఫైడ్ రైస్ కింద మార్చుకొని ఆదాయం పొందొచ్చు. తద్వారా ప్రజలూ మంచి ఆరోగ్యాన్ని పొందుతారు.

# వరల్డ్‌విజన్ సేవలను గుర్తించిన విద్యాశాఖ

## సంస్థ మేనేజర్‌ని సత్కరించిన ప్రభుత్వ అధికారులు

ఒక మనిషి ఉన్నతంగా బ్రతకాలి అంటే చదువుకావాలి. విద్య వలన కలిగే జ్ఞానం జీవితానికి మార్గనిర్దేశం చేస్తుంది. సూర్యుడు ఎలాగైతే తన వెలుగుతో చీకట్లు తొలగిస్తాడో విద్యా జ్ఞానాలు మనిషి జీవితంలో తిమిరాన్ని దూరం చేస్తాయి అన్న సత్యాన్ని నమ్మి, బాల్యం బడిలో ఉండాలి, ఇటుక బట్టీ దగ్గర కాదు, పసితనం చిరునవ్వులు చిందించాలి ట్రాఫిక్ సిగ్నల్ దగ్గర చేతులు చాపకూడదు, పిల్లలు విజ్ఞానంతో వికసించాలి వీధి బాలలుగా బతుకుభారాన్ని మోయకూడదు, చిన్నారుల భవిష్యత్తు బంగారం కావాలి, భయంకరమైన సమస్యల వలయాల్లో చిక్కుకో కూడదు అందుకు సమాజం సామాజిక సంస్థలు, పత్రికలు, ప్రసార మాధ్యమాలు అన్ని ఒక్కటై పనిచేయాలి అనే అజెండాతో వరల్డ్‌విజన్ ఇండియా విజయనగరం జిల్లాలో పలు ప్రజోపయోగ కార్యక్రమాలు ఎన్నో చేస్తున్నారు. ఆర్థిక అసమానతలు, పౌష్టికా హార లోపం, అవిద్య, వైద్య సదుపాయాలు లేమి లాంటి సమస్య లను గుర్తించి వినూత్న కార్యక్రమాలు చేస్తున్నారు. విద్యకు, ఆరోగ్యానికి అత్యధిక ప్రాధాన్యతనిచ్చి అటు విద్యాశాఖ అధికా రులు, ఇటు మహిళా శిశు సంక్షేమ శాఖ అధికారులతో పలు కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. విజయనగరం జిల్లాలో గంట్యాడ గ్రామాన్ని దత్తత తీసుకుని పేద విద్యార్థులు ఉజ్వల భవిష్యత్‌కు బాటలు వేస్తున్న సందర్భంగా ఇటీవల అనగా ఉపాధ్యాయ దినోత్సవాన్ని పురస్కరించుకుని జిల్లా కలెక్టర్, శాసనసభ్యులు, ప్రభుత్వ అధజకారులు, ఇతర ప్రజాప్రతినిధుల నడుమ సంస్థ మేనేజర్ పట్టపు శ్యాంబాబుని ఘనంగా సత్కరించారు. శాలువా కప్పి ప్రశంసాపత్రాన్ని అందచేసారు. గురుపూజోత్సవం నాడు ఈ అరుదైన గౌరవం ఉపాధ్యాయులకే దక్కుతాది గాని వరల్డ్ విజన్ చేస్తున్న ఉత్తమ సేవలకుగాను సంస్థ ఈ గౌరవం దక్కించు కుంది. ఈ సందర్భంగా మేనేజర్ శ్యాంబాబు అంగన్‌వాడీ వాయిస్‌తో మాట్లాడుతూ బాలల్లో పోషకాహార లోపం, సరైన చదువు ఎదుగుదల లేకపోవడం లాంటి పలు సమస్యలు పరిష్క రించేందుకు తమ సంస్థ ముందు వరుసలో ఉంటుందని నిస్వా ర్థంగా తాము ఎన్నో సమాజహిత కార్యక్రమాలు చేస్తున్నామని చెప్పారు. సమాజంలో అందరూ విద్యావంతులైతేనే పేదరికాన్ని



పారద్రోలవచ్చనే ఉద్దేశ్యంతో వరల్డ్‌విజన్ ప్రభుత్వ పాఠశాలలకు మౌలిక సదుపాయాలు విద్యార్థులకు కావలసిన పుస్తకాలు, దుస్తులు వంటివి ఉచితంగా అందిస్తున్నామన్నారు. తమ సంస్థ 13 మంది విద్యార్థులకు ఆర్థికపరమైన సాయం అందిస్తే సత్య భామ యూనివర్సిటీలో ఇంజనీరింగ్ విద్య అభ్యసించుచున్నారని, అలాగే పదవ తరగతితోనే వారి చదువులు ఆగిపోకూడదనే ఉద్దేశ్యంతో పై తరగతుల్లో చేరటానికి తామే ఫీజులు చెల్లిస్తున్నామ న్నారు. తమ సంస్థ ద్వారా ఎంతోమంది విద్యాబుద్ధులు నేర్చుకుని ప్రయోజకులు అయ్యారని శ్యాంబాబు చెప్పారు. ఈ సందర్భంగా సంస్థను, సంస్థ చేసిన సాయాన్ని గుర్తు పెట్టుకుని గౌరవించటం ముదావహం అన్నారు. వరల్డ్‌విజన్ సంస్థ భవిష్యత్తులో మరెన్నో కార్యక్రమాలు నిర్వహించాలని కోరుకుందాం.

# అంగన్‌వాడీ కేంద్రాల్లో కీలకం కానున్న వాలంటీర్ల పాత్ర

## పోషణ రహిత సమాజం కోసం ప్రత్యేక బాధ్యతలు

రాష్ట్రంలో మాతా శిశు మరణాలను, పోషకాహారలోపాన్ని తగ్గించేందుకు ప్రభుత్వం కోట్ల రూపాయలు వెచ్చిస్తున్నా, రక్త హీనత, పోషకాహారలేమితో బాధపడే మహిళలు సంఖ్య పెరుగుతూనే ఉందన్న విషయంపై పాలకులు ఆందోళన చెందుతున్నారు. రాష్ట్రంలో ఎక్కువమంది ఐదేళ్ళలోపు పిల్లలు పౌష్టికాహారం లభించక అనేక రుగ్మతల భారిన పడుతున్నారు. పోషకాహారలోపంతో బరువు తక్కువ పెరుగుదల లేకపోవటం తదితర సమస్యలతో అనారోగ్యం పాలయ్యేవారి సంఖ్య ఎక్కువగా ఉండటం ఆందోళన కలిగిస్తుంది. మహిళలకు రోజుకి రూ. 43లు చిన్నారులకు రూ. 18లు ఖర్చు చేసేందుకు సిద్ధంగా ఉన్నామని ప్రభుత్వం ప్రకటిస్తుంది. ఐసిడిఎస్ ఏర్పడి నాలుగు దశాబ్దాలు పైబడినాగాని రక్తహీనతను పారద్రోలలేకపోతున్నారు. దక్షిణాది రాష్ట్రాలతో పోల్చిచూస్తే మన రాష్ట్రంలో పరిస్థితి ఆందోళనకరంగా ఉందని భావించి ఇటీవలే నియామకం పొందిన గ్రామ, వార్డు, సచివాలయాల వాలంటీర్లను అంగన్‌వాడీ కేంద్రాల నిర్వహణలో కూడా భాగస్వామ్యం చేయాలని ప్రభుత్వం యోచిస్తుంది. పౌష్టికాహారలోపంతో బాధపడుతున్న పిల్లలు, తల్లులు, మహిళలను గుర్తించి పౌష్టికాహారలోపం, రక్తహీనత నిర్ధారణ పరీక్షలు చేయించాలనే ప్రణాళికతో ప్రభుత్వం ఉంది. రాష్ట్రంలో గర్భం దాల్చిన మహిళల్లో 50 శాతం మంది రక్తహీనతతో బాధపడుతున్నారని అధికారులు పేర్కొంటున్నారు. అయితే గ్రామ వాలంటీర్లు తమ పరిధిలోని ప్రతి ఇంటిని సర్వే చేసి పిల్లలను, తల్లులను, మహిళలను అంగన్‌వాడీ కేంద్రాల దగ్గరకు వెళ్ళేలా వారిలో అవగాహన కల్పించేలా చేయాలని ప్రభుత్వం యోచిస్తుంది. ముఖ్యంగా ఎస్సీ, ఎస్టీ, బీసీ ఇతర వర్గాల్లోని పేదరికంతో ఉన్న మహిళలను రక్తహీనత పౌష్టికాహార లోపం నుండి ముందు గట్టెక్కించాలని చూస్తున్నారు. అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా ఏమేమీ ఇవ్వబోతున్నామో వాలంటీర్లకు సమాచార మిచ్చి ఆ మేరకు అవన్నీ కూడా పిల్లలకు తల్లులకు అందేలా చూడాల్సిన బాధ్యత సైతం వాలంటీర్ల మీద మోపబోతున్నారు. దీనినిబట్టి చూస్తే ఇక అంగన్‌వాడీ కేంద్రాలపైన పర్యవేక్షకులు, సిడిపిఒలు, పిడి స్పెషల్ ఆఫీసర్లుతోపాటు వాలంటీర్ల పర్యవేక్షణ కూడా పక్కాగా ఉంటాదని అవగతమవుతున్నది. గ్రామస్థాయిలో ఇప్పటికే అంగన్‌వాడీ కార్యకర్తలు ఎన్నో విధాలుగా అనేక రూపాల్లో వేధింపులకు గురి అవుతున్నారు. చాలా జిల్లాల్లో ఉద్యోగ భద్రత లేకుండానే పనిచేస్తున్నారు. ఈ పరిస్థితుల్లో గ్రామ, వార్డు, సచివాలయాల వాలంటీర్లు కూడా వచ్చి మాపై పెత్తనం చేస్తారా అంటూ ఆందోళన చెందుతున్నారు. గతంలో కంటే ఇప్పుడు ప్రతీది ఆన్‌లైన్ నివేదికలు వచ్చాయని అవినీతికి తావు లేకుండా పనిచేస్తున్న మాపై వీరి అజమాయిషీ ఏంటి అంటూ అసహనం వ్యక్తం చేస్తున్నారు. రక్తహీనత సమస్య దేశమంతా ఉందని లబ్దిదారుల్లో అవగాహన కలగనంతసేపు ఈ సమస్య ఉంటూనే ఉంటుంది అంటున్నారు. చాలావరకు మార్పు తీసుకువచ్చామని ఇంకా తీసుకురావటానికి తామెంతో కష్టపడుతుంటే మధ్యలో వీళ్ళు వచ్చి ఏమి చేయగలరని ప్రశ్నిస్తున్నారు. ప్రభుత్వం ఉదాత్త ఆశయంతో వాలంటీర్లను నియమించుకున్న అంశం గొప్పదే గాని అంగన్‌వాడీ కేంద్రాలపై పర్యవేక్షణకు కాకుండా ఇతర అంశాలపై ఉపయోగించుకుంటే ప్రయోజనం ఉంటుందని అంగన్‌వాడీ కార్యకర్తలు కోరుతున్నారు.

### పాఠకులకు ముఖ్యగమనిక

క్రమం తప్పకుండా ప్రతినెల 'అంగన్‌వాడీ వాయిస్' మాసపత్రిక పొందుతున్న చాలామంది పాఠకులు వారి వార్షిక చందా గడువు ముగిసిపోగానే తిరిగి పునరుద్ధరించుకోవటం లేదు. దయచేసి పత్రిక సాలుసరి చందా పూర్తి కాగానే తిరిగి రూ. **250/-లు** చెల్లించి సభ్యత్వాన్ని రెన్యువల్ చేయించుకోగలరని మనవి. ఏ కారణం చేతనైనా పుస్తకం అందకపోయినా, ఒకే అడ్రస్‌కి **2** పత్రికలు అందుతున్నా గానీ ఈ క్రింది ఫోన్ నెంబర్‌కు తెలియచేయగలరు.

**డి. ఉదయభాస్కరరావు**
**ఎడిటర్, 94401 41712**



# ప్రభుత్వ ఉద్యోగి ఎస్.ఆర్‌లో ఇవి తప్పనిసరి

ప్రతి ప్రభుత్వ ఉద్యోగికి సర్వీసు రిజిస్టర్ (ఎస్ఆర్) ఉంటుంది. ఆ రిజిస్టర్ (పుస్తకంలో) ఉద్యోగికి సంబంధించిన పూర్తి సమాచారం నమోదు చేసుకోవాలి. దాని ఆధారంగా సర్వీసు సాగుతుంది. రిజిస్టర్‌లో ఉంచాల్సిన వివరాలు తెలుసుకుందాం...

01. నియామకపు ఉత్తర్వు
02. చేరిన తేది.
03. స్వస్థలం.
04. విద్య
05. పుట్టుమచ్చలు
06. సర్వీసు పుస్తకం 8వ కాలమ్‌లో ఉద్యోగి సంతకం, తేది.
07. ప్రతి సంవత్సరం ఉద్యోగి తన సర్వీసు రిజిస్టర్‌ను పరిశీలించుకుని సంతకం చేయాలి.
08. నెల మొదటి తేదీన ఉద్యోగంలో చేరిన వారు ఆ ముందు నెల ఆఖరు తేదీన రిటైర్ అయినా ఇంక్రిమెంట్ కలుస్తుంది.
09. డూప్లికేట్ సర్వీసు ప్రకారం అధికారికంగా ఉంచుకోవచ్చు. దీనివల్ల ఎంట్రీలు సక్రమంగా ఉన్నదీ, లేనిదీ సరిచూసుకోవచ్చు.
10. 1-4 నుండి 31-3 వరకు సర్వీసు వెరిఫికేషన్ నమోదు చేయాలి.
11. ఇంక్రిమెంట్ ప్రొసీడింగ్స్.
12. సరెండర్ ప్రొసీడింగ్స్.
13. గ్రూప్ ఇన్సూరెన్స్ స్కీం తేది : 1-11-84 నుండి....
14. ఫ్యామిలీ బెనిఫిట్ ఫండ్ 1977 నుండి అమల్లోకి వచ్చింది. బేసిక్ పేలో వృద్ధి వచ్చినప్పుడు ఉద్యోగి ఎఫ్.బి.ఎఫ్. గ్రూప్‌ను మార్చి నమోదు చేయాలి.
15. ఎర్నడ్ లీవ్, మాఫ్-పే లీవ్, ఎక్స్‌ట్రా ఆర్డినరి లీవ్‌లు ప్రొసిడింగ్స్.
16. ఎర్నడ్ లీవ్, హాఫ్-పే లీవ్, ఎక్స్‌ట్రా ఆర్డినరీ లీవ్‌లకు వెరిఫికేషన్.
17. ఏ కారణంగా చేతనైనా దీర్ఘకాలం సెలవులు పెట్టి డ్యూటీలో చేరిన తర్వాత లీవ్ మంజూరు చేసినప్పుడు నిల్వ ఉన్నంతవరకు ముందుగా ఇయల్ తదుపరి హెచ్.పి.ఎల్. మిగిలినదానికి ఇ.ఓ.ఎల్. మంజూరు చేస్తారు. ఇ.ఓ.యల్. పీరియడ్‌ను తప్పనిసరిగా సర్వీసు వెరిఫికేషన్ ఎంట్రీ వేయాలి.
18. ఎల్.టి.సి. అదర్ ద్యాన్ హోంటౌన్, హోంటైన్ ఎంట్రీ.
19. ఎల్.టి.సి. డిక్లరేషన్.
20. లీవ్ ఎకౌంట్.
21. హాఫ్ పే లీవ్ ఎకౌంట్.
22. పే ఫిక్సేషన్ ఎంట్రీలు.
23. నామినీ సహ కుటుంబసభ్యుల వివరాలు.
24. స్పెషల్ గ్రేడ్ ఇంక్రిమెంట్లు 8-16-24 శాంక్షన్ ఆర్డర్ ఎంట్రీలు.
25. ఉంటే స్పెషల్ గ్రేడ్ ఎంట్రీ.
26. ఫ్యామిలీ ప్లానింగ్ ఇంక్రిమెంట్ శాంక్షన్ ఆర్డర్ ఎంట్రీ.
27. బదిలీ సమయంలో రిలీఫ్ ఎంట్రీ.
28. సర్వీసు వెరిఫికేషన్ ఎంట్రీ.
29. గ్రూపు ఇన్సూరెన్స్ ఎంట్రీ, సర్వీసు పుస్తకంలో వ్రాయాలి.
30. ట్రాన్స్‌ఫర్‌పై వచ్చి జాయిన్ అయిన ఎంట్రీ.
31. జర్నీ పీరియడ్ ఎవైల్ చేసుకున్న ఎంట్రీ.
32. ఏ కారణంతో ట్రాన్స్‌ఫర్ ఎంట్రీ (ఈ ఎంట్రీలు వేయించుకుంటే సీనియారిటీ లిస్టులో న్యాయం జరుగుతుంది)
33. సంతకాలు కాని ఎంట్రీలు ఉంటే జాగ్రత్తగా చూసుకొని సంతకాలు చేయించుకోవాలి.
34. ఏదైనా సందర్భంలో సంబంధిత రికార్డులు అందుబాటులో లేనప్పుడు సంబంధిత ఉద్యోగి అఫిడవిట్ ఇస్తూ ఆ కాలంలో తనతో కలిసి పనిచేసిన మరొక తోటి ఉద్యోగి అఫిడవిట్ దాఖలుచేసి ఎంట్రీ వేయించుకోవచ్చు.
35. ప్రత్యేక ప్రోత్సాహక, ప్రోత్సాహక ఇంక్రిమెంట్లు, సర్టిఫికెట్లు మోడల్స్, పొందినట్లయితే అలాంటివి కూడా సర్వీసు పుస్తకంలో నమోదు చేస్తారు.
36. జి.పి.ఎఫ్ అకౌంట్ నెం.
37. ఎ.పి.జి.ఎల్.ఐ. నెం.
38. కుల ధృవీకరణ నమోదు.
39. ఎంప్లాయి ఐ.డి. నెం.
40. 610 జీ.వో. ప్రకారం లోకల్ స్టేటస్ నమోదు.
41. ఎఫ్.ఆర్. 26డి2 సర్టిఫికెట్ కూడా లీవ్ మంజూరు ప్రొసిడింగ్సుతో పాటుగా సర్వీసు రిజిస్టరులో నమోదు చేయాలి.
42. సర్వీసు క్రమబద్ధీ ప్రొహిబిషను ఎంట్రీ.



# పండుగలా పోషణ మాసోత్సవ వేడుకలు

## గత ఏడాది కంటే భిన్నంగా కార్యక్రమాలు

## ఇంటింటి వ్యవహారంగానే మారిన పౌష్టికాహారం

## మరోమారు దశదిశలా వ్యాపించిన ఐసిడిఎస్ కీర్తి

**మేఘన ఉదయ్** ఎం.ఎస్సి., (ప్రత్యేక ప్రతినిధి, అంగన్‌వాడీవాయిస్)

చిన్నపిల్లలకు, మహిళలకు, గర్భిణీలకు సరైన పోషణ అందించటానికి భారత ప్రభుత్వం గత ఏడాది ప్రారంభించిన పథకం నేషనల్ న్యూట్రీషన్ మిషన్ దీన్నే పోషణ అభియాన్ అని పిలుస్తారు. ***2018*** మార్చి *8న* ప్రారంభమైన ఈ పథకం ద్వారా అసంఖ్యాక మహిళల ఆరోగ్యాన్ని, ఆయువును శుష్కింపచేస్తున్న రక్తహీనతను తగ్గించి పిల్లలు, మహిళలను ఆరోగ్యవంతులుగా తీర్చిదిద్దుతారు. ముఖ్యంగా పోషకాహారలోపం, రక్తహీనత, తక్కువ బరువుతో పిల్లలు జన్మించడం, పిల్లలు సరిగా ఎదగకపోవటం లాంటి అంశాలుపై అవగాహన కల్పిస్తారు. ప్రభుత్వ అంచనాల ప్రకారం ప్రతి ఇద్దరు మహిళల్లో ఒకరు రక్తహీనతతో బాధపడుతున్నారు. ప్రతి ముగ్గురిలో ఒకరిలో సరైన పెరుగుదల లేదు, ప్రతి ముగ్గురు పిల్లల్లో ఒకరు పోషకాహారలోపంతో బాధపడుతున్నారు. ప్రతి ఐదుగురి పిల్లల్లో ఒకరు శక్తిహీనులుగా ఉన్నారు. అలాగే ప్రతి వెయ్యి మందిలో ***37*** మంది సంవత్సరంలోపు వివిధ కారణాల వల్ల చనిపోతున్నారు. నేషనల్ న్యూట్రీషన్ మిషన్ ద్వారా వీటినన్నిటిని తగ్గించాలని లక్ష్యంగా పెట్టుకున్నారు. దీనిలో భాగంగా నేషనల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియన్ న్యూట్రీషన్ ఛాలెంజెస్ సమావేశం ***2018*** జూలైలో జరిగింది. దీని ఆధారంగా సెప్టెంబరు ***2018***ని జాతీయపోషక నెలగా జరుపుకోవాలని నిర్ణయించారు. అదే సాంప్రదాయాన్ని ఈ ఏడాది కూడా కొనసాగించి వినూత్న కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు. దీని ముఖ్య ఉద్దేశ్యం ఆరోగ్యానికి పోషణ అవసరాన్ని తెలియచెప్పటం, పోషక పదార్థాల లోపం వల్ల శారీరక పెరుగుదల అభి వృద్ధిపై చూపే ప్రభావం కలిగే ఆర్థికభారం చివరిగా దేశ అభివృద్ధికి, పోషణకు ఉన్న సంబంధంపై అవగాహన కల్పించటం. పోషకాహారలోపం వల్ల పిల్లలు, మహిళల్లో వ్యాధినిరోధకత తగ్గి అనేక వ్యాధులకు గురి అవుతున్నారు. చాలామంది దీనివలన మరణిస్తున్నారు. శరీరానికి సరైన పోషకాలు అందకపోవటం వల్ల నేరుగా మరణం సంభవించకపోయినప్పటికీ దాని కారణంగా పిల్లలు తక్కువ బరువుతో పుట్టడం, రోగ నిరోధక శక్తి తగ్గిపోవడం, న్యూమోనియా, డయేరియా లాంటి వ్యాధులు కలగడం, ఇన్ఫెక్షన్లు సోకడం లాంటి కారణాలతో మరణిస్తున్నారు. వీటినన్నిటిని దృష్టిలో పెట్టుకుని మహిళా శిశు సంక్షేమశాఖ అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా ఎన్నో కార్యక్రమాలను చేపడుతున్నారు. గర్భిణీ, బాలింతలు పిల్లలకు ఆరోగ్యం, పోషకాహారం, పూర్వ ప్రాథమిక విద్య తదితర ప్రాథమిక అవసరాలు తీర్చే విధంగా సమగ్ర సేవల రూపంలో ఎన్నో సంక్షేమ కార్యక్రమాలు అమలుచేస్తున్నారు. పేద ప్రజల అభ్యున్నతి సాధనకోసం రూపొందించిన ఐసిడిఎస్ ద్వారా రాష్ట్రవ్యాప్తంగా ***55,600*** అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా ***12.24*** లక్షల మంది చిన్నారులకు అంగన్‌వాడీల్లో మధ్యాహ్న భోజనం అందిస్తుండగా ***6.62*** లక్షల మంది గర్భిణీలు, బాలింతలు లబ్ది పొందుతున్నారు. అంతేకాక మాతాశిశు సంరక్షణ, శిశువు జన్మించిన దగ్గర నుండి ఆరేళ్ళ పోషణ, వారి ఆరోగ్య స్థాయి మెరుగుపర్చడం, తల్లిపిల్లల్లో పోషకాహార లోపాన్ని అధికమించడం, శిశువులు ఆరోగ్యంగా పెంచేటట్లు తల్లికి తగు శిక్షణనిచ్చి నైపుణ్యవంతురాలిగా తీర్చిదిద్దటం లాంటి పనులు అన్ని అంగన్‌వాడీ కేంద్రాల ద్వారానే జరుగుతున్నాయి. రాష్ట్రవ్యాప్తంగా అమలవుతున్న ఐసిడిఎస్ కార్యక్రమాన్ని మెరుగుపరిచేందుకు ఎప్పటికప్పుడు అధికారులు తగిన చర్యలు తీసుకుంటున్నారు. పోషణ మాసోత్సవ సందర్భంగా ఈ ఏడాది పలు కార్యక్రమాలను రూపకల్పన చేసి నెలంతా సరిపడ జాబితాను ముందుగానే సిద్ధం చేసి ఆయా జిల్లాలకి పంపించారు. ప్రారంభ వేడుకను కూడా ఎంతో అట్టహాసంగా తూర్పుగోదావరి జిల్లాలో నిర్వహించి లబ్దిదారులతో జయహో పోషణ అభియాన్ అనిపించారు. ఇటీవల పోషణ అభియాన్ అమలు తీరుకు జాతీయస్థాయిలో మన రాష్ట్రానికి నగదు బహుమతితోపాటు అవార్డులు కూడా రావటంతో సిబ్బంది రెట్టింపు ఉత్సాహంతో వేడుకలు నిర్వహించారు. రాష్ట్రంలో ఏ జిల్లాలో ఎలా జరిగాయో తెలుసుకునే ప్రయత్నం ఈ చిన్న వ్యాసం....



# అనంతపురం జిల్లా

మహిళా శిశు సంక్షేమశాఖ మరియు ఆరోగ్య శాఖ ఇతర ప్రభుత్వ శాఖలతో కలిసి పిల్లలు, గర్భిణీ, బాలింతల్లో పోషణ స్థాయిని మెరుగుపర్చుటకు పలు కార్యక్రమాలు నిర్వహించారు. జిల్లాలోగల 17 ఐసిడిఎస్ ప్రాజెక్టులలో అట్టహాసంగా పోషణ మాసోత్సవాలు నిర్వహించారు. లోపపోషణతో బాధపడుతున్న వారికి ఈ కార్యక్రమాలు ఆలోచింపజేసే రీతిలో ఉన్నాయి. అభివృద్ధి చెందుతున్న రాష్ట్రంలోని పిల్లల మహిళలు ఆరోగ్యస్థితిని మెరుగుపర్చాలన్న దృఢ సంకల్పంతో పోటాపోటీగా కార్యక్రమాలు నిర్వహించారు. తల్లులు పిల్లల మరణాల సంఖ్య తగ్గించేందుకు కావలసిన ఆరోగ్య సూత్రాలు అందరికి అర్థమయ్యే రీతిలో ప్రచారం చేసారు. శిశువు ఆరోగ్యంగా పెరిగి అభివృద్ధి చెందాలంటే ఎలాంటి ఆహారం తినిపించాలి, గర్భిణీలు తినాల్సిన ఆహారం, బాలింతలు ఎలాంటి ఆహారం తీసుకుంటే తల్లి బిడ్డ క్షేమంగా ఉంటారో తల్లి పాల యొక్క విశిష్టత, కౌమార బాలికలు ఎలాంటి ఆరోగ్య జాగ్రత్తలు పాటించి ఎటువంటి ఆహారం భుజించాలి అనే విషయాలుపై క్షేత్రస్థాయిలో అవగాహన కల్పించారు.

## హిందూపురం

ప్రాజెక్టులో సిడిపిఓ నాగమల్లేశ్వరి ఆధ్వర్యంలో ప్రతి సెక్టారు పరిధిలోనూ అంగన్‌వాడీ కేంద్రాల్లోను ప్రాజెక్టు పరిధిలోనూ పలు కార్యక్రమాలు నిర్వహించారు. అంగన్‌వాడీల ద్వారా అందుతున్న సేవలను అందరికి అర్థమయ్యేరీతిలో ప్రదర్శన ద్వారా చూపించారు. ఈ కార్యక్రమానికి రాష్ట్రమంత్రి శంకర నారాయణ సైతం హాజరై అంగన్‌వాడీ సేవలను అభినందించారు. ప్రభుత్వం ద్వారా అందుతున్న పోషకాహారాన్ని అర్హులైన ప్రతివారు తిని ఆరోగ్యంగా ఉండాలన్నారు. అంగన్‌వాడీ కేంద్రాలు గతంలో కంటే ఇప్పుడు మెరుగ్గా ఉన్నాయని, అంగన్‌వాడీ కేంద్రాల్లో పూర్వప్రాథమిక విద్యను అభ్యసించేటట్లు పిల్లలను ప్రోత్సహించా





లన్నారు. గర్భిణీలు సరైన ఆహారం తీసుకుంటూ వైద్యసలహాలు పాటించి పండంటి బిడ్డకు జన్మనివ్వాలని హితవు పలికారు. ఈ సందర్భంగా గర్భిణీ స్త్రీలకు సీమంతాలు నిర్వహించారు. తక్కువ ఖర్చుతో అందుబాటులో దొరికే వస్తువులతో తయారు చేసిన పౌష్టికాహార ప్రదర్శనను తిలకించారు. కార్యక్రమంలో సూపర్‌వైజర్లు, కార్యకర్తలు, సిబ్బంది పాల్గొన్నారు.

## కంబదూరు ప్రాజెక్టు

శిశువులు చంటి పిల్లలకు ఇచ్చే ఆహారం జీవితాంతం మంచి పోషణను ఇస్తుంది. కాబట్టి 6 నెలలు తర్వాత తల్లిపాలతోపాటు అదనపు ఆహారాన్ని అందించాలని సిడిపిఓ అరుంధతి అన్నారు. పోషణ మాసోత్సవ వేడుకలను ఘనంగా నిర్వహించారు. అంగన్‌వాడీ కేంద్రాల స్థాయిలో గ్రామాల్లో తిరిగి లబ్ధిదారులతో మమేకమై లోపపోషణ ఏవిధంగా ఏర్పడుతుంది, లోపపోషణ రాకుండా తీసుకోవాల్సిన చర్యలపై అవగాహన కల్పించారు. ముఖ్యంగా తల్లిపాల విశిష్టతను తల్లిపాలు త్రాగిన బిడ్డ ఎదుగుదల ఎలా ఉంటాదనే విషయాలపై బాలింతల్లో అవగాహన కల్పించారు. కార్యక్రమంలో సూపర్‌వైజర్లు అంగన్‌వాడీ కార్యకర్తలు పాల్గొన్నారు.





## రాయదుర్గం

ప్రాజెక్టు పరిధిలోని జుంజురాంపల్లిలో వేడుకగా నిర్వహించారు. సిడిపిఒ ప్రభావతి ఇతర శాఖల అధికారులు అనగా ఐసిడిఎస్‌తో పాటు, వైద్య ఆరోగ్యశాఖ, పంచాయతీరాజ్, ఆర్ డబ్ల్యూఎస్, విద్యాశాఖలతో పౌష్టికాహారం ఇంటింటి వ్యవహారంలోని ముఖ్యాంశాలు. అనగా వెయ్యి రోజుల సంరక్షణ, రక్తహీనత



నివారణ, డయేరియా నివారణ, పౌష్టికాహారం, చేతుల పరిశుభ్రత లాంటి విషయాలపై లబ్ధిదారుల్లో అవగాహన కల్పించారు. గర్భిణీల్లో రక్తహీనత రాకుండా సరైన పోషకాహారాన్ని భుజించి ఆరోగ్యంగా ఉండాలని చెప్పారు. కాలానుగుణంగా దొరికే ఆహారం భుజించాలి అన్నారు. ఆరోగ్యం ఎంత ప్రధానమో పరిశుభ్రత అంతే ప్రధానమన్నారు. ఈ సందర్భంగా చౌకగా దొరికే పదార్థాలతో పౌష్టికాహారం తయారుచేసి ప్రదర్శనగా ఉంచి అందరికి వివరించారు. కార్యక్రమంలో సూపర్‌వైజర్లు, కార్యకర్తలు పాల్గొన్నారు.

## కూడేరులో

గర్భిణీ స్త్రీలు ప్రతిరోజూ తినే ఆహారంలో చిరుధాన్యాలు పప్పు దినుసులు ఆకుకూరలు ఎక్కువగా ఉండాలని తగిన పోషక విలువలున్న ఆహారం భుజించటం మూలంగా పుట్టబోయే బిడ్డ



ఆరోగ్యం బాగుంటుందని సిడిపిఒ శ్రీదేవి అన్నారు. పోషణవేడుకలు సందర్భంగా ప్రాజెక్టు పరిధిలో మహిళలకు వంటల పోటీ నిర్వహించారు. అంతేకాక గృహదర్శనం చేసి గర్భిణీలు, బాలింతలకు అవగాహన కల్పించారు. గర్భిణీగా ఉన్నప్పుడు ఐరన్, ఫోలిక్‌యాసిడ్ మాత్రలు వేసుకోవాలన్నారు. నెలలు నిండక ముందు పుట్టే బిడ్డల విషయంలో తీసుకోవాల్సిన జాగ్రత్తలు సూచించారు. ఆరోగ్య రీత్యా ఏ స్త్రీ కూడా 18 సంవత్స రాలలోపు గర్భవతి కాకూడదని చిన్న వయస్సులో జరిగే వివాహాలు ప్రమాదకరం అన్నారు. ఫుడ్‌స్టాల్ ఏర్పాటు చేసి అవగాహన కల్పించారు. కార్యక్రమంలో పర్యవేక్షకులు, కార్యకర్తలు పాల్గొన్నారు.

## గుత్తి

పోషణ మాసోత్సవంలో భాగంగా ప్రాజెక్టు స్థాయిలో లబ్ధిదారులకు అవగాహన సదస్సు ఏర్పాటుచేసి పోషకాహారం విశిష్టతను తెలియచేసారు. సిడిపిఒ నాగమణి ఆధ్వర్యంలో, ఆరోగ్య కార్యకర్తలు, మెప్మా, ఇతర శాఖల అధికారులు పాల్గొన్నారు. గర్భిణీ బాలింతలు, పిల్లల్లో పోషణస్థాయిని ఏవిధంగా మెరుగు



పర్చాలో తెలియచేసారు. ముఖ్యంగా గర్భవతులుగా ఉన్నప్పుడు తీసుకోవాల్సిన జాగ్రత్తలు ఆరోగ్య సలహాలు తదితరాలపై క్షేత్రస్థాయి అవగాహన కల్పించారు. తల్లిపిల్లల ఆరోగ్యానికి సరైన ప్రాధాన్యతనిచ్చి వారి ఆరోగ్యం కాపాడటంలో కుటుంబ సభ్యుల పాత్ర ఎంతో కీలకమని చెప్పారు. తల్లిపిల్లల ఆహార విషయంలో సరైన జాగ్రత్తలు పాటించకపోతే బిడ్డ లోపపోషణకు గురయే అవకాశాలు మెండుగా ఉంటాయన్నారు. కార్యక్రమంలో పర్యవేక్షకులు, కార్యకర్తలు, కౌమార బాలికలు పాల్గొన్నారు.

## మడకశిర

పోషకాహారం తీసుకుంటే ప్రతిఒక్కరూ సంపూర్ణ ఆరోగ్యవంతులుగా జీవించవచ్చునని సిడిపిఒ విజయకుమారి అన్నారు. పోషకాహార మాసోత్సవాల సందర్భంగా ప్రాజెక్టు పరిధిలో...







రామగిరి మండలంలో ఏర్పాటు చేసిన కార్యక్రమంలో ఇతర శాఖల అధికారులతో కలసి పోషణ మాసోత్సవ వేడుకలు నిర్వహించారు. మనచుట్టూ ఉన్న పరిసరాల్లో మనకు అందుబాటులో ఉన్న ఆకుకూరలు, కూరగాయల్లో అపారమైన పోషకాలున్నాయని వాటిని క్రమం తప్పకుండా తీసుకోవాలన్నారు. అలాగే గర్భిణీగా ఉన్న సమయంలో సరైన పోషక పదార్థాలుండే ఆహారం భుజించాలన్నారు. అభివృద్ధి చెందుతున్న దేశాల్లో భారత్ ఎక్కడో ఉందని, మనకంటే చిన్న దేశాలు ముందు వరసలో ఉన్నాయన్నారు. అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా అందించే ఆహారాన్ని భుజించి ఆనందంగా, ఆరోగ్యంగా ఉండాలన్నారు. కార్యక్రమంలో సూపర్‌వైజర్లు, కార్యకర్తలు పాల్గొన్నారు.

## అనంతపురం అర్బన్ ప్రాజెక్టు

ఆరోగ్య ఆంధ్రప్రదేశ్ సాధనే ప్రభుత్వ ఆశయమని ఆ దిశగా పేదలకు పౌష్టికాహారం క్రమం తప్పకుండా అందచేయాలని బిసి సంక్షేమశాఖ మంత్రి శంకరనారాయణ అన్నారు. అనంతపురం అర్బన్ ప్రాజెక్టులో పౌష్టికాహార మాసోత్సవాల సందర్భంగా కలెక్టరేట్ కార్యాలయంలో పౌష్టికాహార ప్రదర్శనను ఐసిడిఎస్ శాఖ ఏర్పాటు చేసింది. వాటిని కలెక్టర్ సత్యనారాయణతో కలిసి మంత్రి సందర్శించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ గర్భిణీ, బాలింతలు, శిశువులకు పౌష్టికాహారం సంపూర్ణంగా అందించాలన్నారు. మాతా శిశుమరణాల రేటును అరికట్టాలంటే అర్హులైన ప్రతి వారికి పోషకాహారం అందాలన్నారు. అనంతరం పిడి చిన్మయీదేవి, సిడిపిఒ వనజా అక్కమ్మ, జిల్లా సమైఖ్య వెలుగు సిబ్బందిని హాజరుపరిచి గర్భిణీ వెయ్యి రోజులు సంరక్షణపై సంపూర్ణ అవగాహన కల్పించారు. అసలు గర్భిణీల్లో, బాలింతల్లో పోషకాహార లేమికి గల కారణాలు, పోషణ లోపం లేకుండా ఉండాలంటే ఎలాంటి ఆహారం తీసుకోవాలి తదితర విషయాలపై అందరికి అర్థమయ్యే రీతిలో వివరించారు. ఈ కార్యక్రమంలో పర్యవేక్షకులు, అంగన్‌వాడీ కార్యకర్తలు, సహాయకులు, కార్యాలయం సిబ్బంది పెద్ద ఎత్తున పాల్గొన్నారు.

## తాడిపత్రి ప్రాజెక్టు

పౌష్టికాహారం సమతుల్య ఆహారం వల్ల ఆరోగ్యవంతమైన సమాజం సాధ్యపడుతుందని ప్రాజెక్టు డైరెక్టర్ చిన్మయిదేవి అన్నారు. పోషణ అభియాన్‌లో భాగంగా పోషణ మహా వేడుకలను తాడిపత్రి ప్రాజెక్టులో అత్యంత ప్రతిష్టాత్మకంగా నిర్వహించారు. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా హాజరైన పిడి చిన్మయిదేవి మాట్లాడుతూ గ్రామీణ ప్రాంతాల్లోని మహిళలు, గర్భిణీలు, బాలింతలు, శిశువులు అందుబాటులో ఉన్న ఆకుకూరలు,









చిరుధాన్యాలు, పండ్లు, గుడ్లు, పాలుతో వంటి వాటితో సమతుల్యమైన పోషకాహారం పొందవచ్చునన్నారు. సిడిపిఒ శశికళ మాట్లాడుతూ శారీరక, ఆరోగ్య సమతుల్యం కోసం ప్రతిఒక్కరూ సరైన పోషకాహారం తీసుకోవడం ముఖ్యమన్న విషయంపై అవగాహన కల్పిస్తూ జాతీయ పోషకాహార వారోత్సవాలను నిర్వహిస్తున్నట్లు ఆమె చెప్పారు. ఈ సందర్భంగా పోషకాహారం మెండుగా ఉండే ఆహార పదార్థాలను ప్రదర్శించి వాటివలన ఉపయోగాలు తెలియచెప్పారు. కార్యక్రమంలో సూపర్‌వైజర్లు, కార్యకర్తలు, సిబ్బంది పాల్గొన్నారు.

**శింగనమల**

అందరూ ఆరోగ్యంగా ఉండేందుకు పౌష్టికాహారంపై అవగాహన కలిగి ఉండాలని ఆరోగ్యం, పౌష్టికాహారం పట్ల ప్రతి వారు శ్రద్ధ వహించాలని సిడిపిఒ ఉమాశంకరమ్మ అన్నారు. రాష్ట్ర వ్యాప్తంగా ఐసిడిఎస్‌లో జరుగుతున్న పోషణ మాసోత్సవ వేడుకలను శింగనమల ప్రాజెక్టులో నిర్వహించారు. ఈ సందర్భంగా గర్భిణీలకు, బాలింతలకు అవగాహన కల్పించారు. జీవించి ఉండటానికి పోషణ ఒక మౌలికమైన అవసరమని శారీరక, మానసిక పెరుగుదలకు పోషకాహారం ప్రముఖపాత్ర వహిస్తుందన్నారు. అంగన్‌వాడీ కేంద్రాలు అందించే ఆహారం జీవితాంతం



మంచి ఆరోగ్యానికి పునాది వేయటమేకాక చక్కటి శక్తినిస్తుందన్నారు. పోషణస్థాయిని మెరుగుపర్చేందుకు ఇతర శాఖల సమన్వయంతో పలు కార్యక్రమాలు నిర్వహిస్తున్నామన్నారు. ఈ కార్యక్రమంలో పర్యవేక్షకులు, కార్యకర్తలు పాల్గొన్నారు.

**కల్యాణదుర్గం**

పోషణ మాసోత్సవం సందర్భంగా ప్రాజెక్టు పరిధిలో పలు కార్యక్రమాలు నిర్వహించారు. పల్లెపిలుపు పేరుతో అన్ని శాఖల అధికారులను సమన్వయం చేసి అందుబాటులో లభించే పోషకాహార ప్రదర్శనను ఏర్పాటు చేసి పౌష్టికాహారలోపం లేకుండా ఎలాంటి ఆహారం భుజించాలో సిడిపివో గీతాంజలి, వైద్య ఆరోగ్యశాఖ అధికారులతో కలిసి అవగాహన కల్పించారు. గర్భం



ధరించిన దగ్గర నుండి ఒక క్రమమైన పద్ధతిలో పోషకాహారం తీసుకుంటే ఎలాంటి ఇబ్బందులు ఏర్పడవన్నారు. ఎదిగే పిల్లల్లో పోషకాహారలోపం ఉంటే భవిష్యత్తులో ఇబ్బందులు తలెత్తుతాయని తెలిపారు. కార్యక్రమంలో సూపర్‌వైజర్లు, కార్యకర్తలు అధిక సంఖ్యలో పాల్గొన్నారు.

## తూర్పుగోదావరి జిల్లా

లోపపోషణ లేని సమాజ నిర్మాణమే మనందరి ధ్యేయం అని, పిల్లలు, బాలికలు, గర్భిణీ బాలింతల ఆరోగ్య పోషణ కోసం అందరూ సహకరించాలంటూ మహిళా శిశు సంక్షేమశాఖ మంత్రి తానేటి వనిత వైభవోపేతంగా రాజమండ్రిలో పోషణమాసోత్సవ వేడుకలను లాంఛనంగా ప్రారంభించారు. రాష్ట్రాన్ని ఆరోగ్య ఆంధ్రప్రదేశ్‌గా తీర్చిదిద్దాలని పిలుపునిచ్చారు. ఇంట్లో మహిళలు ఆరోగ్యంగా ఉంటే కుటుంబసభ్యులతోపాటు సమాజం సైతం ఆరోగ్యంగా ఉంటుందన్నారు. నెలంతా జరిగే ఈ వేడుకలను ప్రతిష్ఠాత్మకంగా నిర్వహించాలని, గత ఏడాది కంటే భిన్నంగా కార్యక్రమాలు నిర్వహించాలని ఆదేశాలు జారీ చేసారు. రాష్ట్ర ప్రభుత్వం మహిళా శిశు సంక్షేమం నిమిత్తం



కోట్లాది రూపాయలు వెచ్చిస్తుందని, నిధులు సక్రమంగా ఖర్చు చేసి ప్రతి లబ్దిదారునికి అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా సంపూర్ణ సేవలు అందాలన్నారు. నేటికి సమాజంలో పోషకాహారం మీద సరైన అవగాహన లేక గ్రామీణ ప్రాంతాల్లోని మహిళలు, పిల్లలు లోపపోషణకు గురవుతున్నారని ఇలాంటివారికి అవగాహన కల్పించాలన్నారు. చిన్నారుల్లో పౌష్టికాహారలోపం వల్ల ఎదుగుదల లోపం, మహిళల్లో రక్తహీనత సంభవిస్తున్నాయన్నారు. ఏజెన్సీ ప్రాంతాల్లోని మండలాల్లో బాలల వికాసంపైన శ్రద్ధ కనబర్చాలన్నారు. గిరిజనుల ఆహారపు అలవాట్లు ఆరోగ్య ప్రవర్తనలో మార్పు తీసుకురావటం ద్వారా పోషకాహార లోపాన్ని నివారించాలన్నారు. ఐసిడిఎస్ వైద్య ఆరోగ్యశాఖలతోపాటు వివిధ శాఖల సమన్వయంతో పనిచేసి రాష్ట్రాన్ని ఆరోగ్య ఆంధ్రప్రదేశ్‌గా తీర్చిదిద్దాలన్నారు. ఈ సందర్భంగా నెలరోజులపాటు చేయాల్సిన కార్యక్రమాలు మంత్రి ఒకేరోజు దాదాపు అన్నప్రాసనం, సీమంతాలు తదితర కార్యక్రమాల్లో పాల్గొన్నారు. కార్యక్రమానికి ప్రిన్సిపల్ సెక్రటరీ దమయంతి, డైరెక్టర్ కృతికాశుక్లా, కేంద్ర ప్రభుత్వం నుండి ఇ.డి ఆదిత్య చోప్రా, ప్రజాప్రతినిధులు రావటంతో సిబ్బంది నూతనోత్సవంతో జిల్లా అంతా మంచి కార్యక్రమాలు నిర్వహించారు.

### రాజానగరం

దేశంలో ఇప్పటికే రక్తహీనత మహిళల్లో ప్రధాన సమస్యగా ఉందని 15-49 ఏళ్ళ మధ్య బాలికలు, యువతులు, మహిళల్లో రక్తహీనత ఎక్కువ వుంది. దీనిమూలంగానే తల్లుల మరణాలు ఎక్కువగా జరుగుతున్నాయని సిడిపిఒ సుశీల అన్నారు. పోషణ మాసోత్సవం సందర్భంగా ప్రాజెక్టు పరిధిలోని ప్రతి సెక్టారులో వినూత్నమైన కార్యక్రమాలు నిర్వహించారు. బాలల్లో పోషకాహారలోపాన్ని మహిళల్లో రక్తహీనతను నివారించేందుకు అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా నాణ్యమైన పౌష్టికాహారాన్ని అందిస్తున్నారని అర్హులైన ప్రతివారు లబ్ధిపొందాలన్నారు. జీవితాంతం సంపూర్ణ






ఆరోగ్యంతో, చక్కని ధారుఢ్యంతో సుఖమయ జీవితాన్ని గడపాలని హితవు పలికారు. మనం రోజువారి తినే ఆహారంలో కాయగూరలు, పప్పుధాన్యాలు, ఆకుకూరలు, పండ్లు ఉండేలా చూసుకోవాలన్నారు. 2015లో ఐక్యరాజ్యసమితిలోని సభ్య దేశాల మధ్య జరిగిన ఒప్పందం ప్రకారం సుస్థిర అభివృద్ధి కోసం జరిగే ప్రయత్నాల్లో పిల్లల పోషణ అత్యంత ప్రాధాన్యం సంతరించుకుందని 2030 నాటికి ప్రపంచ దేశాల్లో ఆరోగ్యకరమైన వాతావరణం అలాగే పిల్లలు, మహిళల, కిశోరి బాలికల పోషణ స్థితిలో మెరుగుదల కనిపించేందుకు మనమంతా కృషి చేయాలని పిలుపునిచ్చారు. ఈ సందర్భంగా గర్భిణీలకు సీమంతాలు నిర్వహించారు. గృహాలు సందర్శించి బాలింతలకు, గర్భిణీలకు పోషకహారంపై అవగాహన కల్పించారు. ముఖ్యంగా పాలిచ్చే తల్లులు గర్భిణీలు ఆరోగ్య విషయాలపై వైద్య సిబ్బందితో కలిసి అవగాహన కల్పించారు. రోజుకోరకమైన కార్యక్రమం నిర్వహించి లబ్దిదారులను ఆలోచింపచేసారు. పరిసరాల పరిశభ్రతపై కూడా అవగాహన కల్పించారు. ఈ కార్యక్రమాల్లో సూపర్‌వైజర్లు, అంగన్‌వాడీ కార్యకర్తలు, ఇతర శాఖల అధికారులు పాల్గొన్నారు.

### రాజమండ్రి

పౌష్టికాహార మాసోత్సవ వేడుక రాజమహేంద్రవరం ప్రాజెక్టులో ఘనంగా నిర్వహించారు. ఈ సందర్భంగా సిడిపిఒ





నర్సమ్మ మాట్లాడుతూ గర్భిణీలు, బాలింతలు క్రమం తప్పకుండా పౌష్టికాహారం తీసుకోవాలని చెప్పారు. తల్లి బిడ్డ ఆరోగ్యంగా ఉండాలనే ఆలోచనతో అంగన్వాడీ కేంద్రాల ద్వారా క్రమం తప్పకుండా పోషకాహారాన్ని అందిస్తుందన్నారు. స్త్రీ, గర్భం దాల్చిన దగ్గర నుండి అందుబాటులో దొరికే పోషకాహారాన్ని భుజిస్తే పుట్టబోయే బిడ్డ ఆరోగ్యంగా జన్మిస్తుందన్నారు. సరైన పోషకాహారం తీసుకుంటే అంటువ్యాధుల నుండి సంరక్షణ కూడా లభిస్తుందన్నారు. అలాగే గర్భిణీలు ఐరన్ఫోలిక్యాసిడ్ (ఐ.ఎఫ్.ఎ) మాత్రలు వేసుకోవాలన్నారు. గర్భిణీలు రక్తహీనతకు గురైతే కొన్ని సందర్భాల్లో చనిపోయే అవకాశం కూడా ఉంటుందన్నారు. ఒక మహిళ గర్భవతి అయిన దగ్గర నుండి బిడ్డకు 2 సంవత్స రాలు నిండే వరకు మధ్య ఉన్న కాలం 1000 రోజులు అని ఈ వెయ్యి రోజులలో తల్లి బిడ్డకు అందే పోషణ మరియు ఆరోగ్య సంరక్షణ బిడ్డ జీవితకాలం ప్రభావం ఉంటుంది కాబట్టి ఈ 1000 రోజులు చాలా ముఖ్యం అన్నారు. కార్యక్రమాల్లో సూపర్వైజర్లు, కార్యకర్తలు పాల్గొన్నారు.

### కాకినాడ

శిశువులు, చిన్నపిల్లలు, గర్భిణీ బాలింతలు తీసుకునే ఆహార పద్ధతులపై అవగాహన కల్గించేందుకు కళా జాతా బృందాన్ని ఏర్పాటు చేసి లబ్దిదారుల్లో అవగాహన కల్గించారు. ఆహార పద్ధతులను ప్రోత్సహించడంలో సమాజంలో అనేక వర్గాల ప్రభావ పూరితమైన పాత్ర కలిగి ఉన్నాయి అని ఈ కళాజాతా ద్వారా నిరూపించారు. ఐసిడిఎస్ ద్వారా అమలయ్యే కార్యక్రమా లను కళాకారులు బృందం చక్కగా అందరికి అర్థమయ్యే రీతిలో వివరించి చెప్పారు. పోషకాహార లోపం అనేది జాతీయ సమస్య అని దీనిని నిర్మూలించటం కోసం పలువురు చేతులు కలపాలని పిలుపునిచ్చారు. ఈ సందర్భంగా పిడి దాసరి సుఖజీవన్బాబు మాట్లాడుతూ పోషణ మాసోత్సవం సందర్భంగా ప్రతి ప్రాజెక్టు పరిధిలోనూ వినూత్నమైన కార్యక్రమాలు చేస్తున్నట్లు తెలిపారు.





మహిళలు నిరక్షరాస్యత మూలంగా పోషకాహార లోపం వస్తుందని ప్రతివారు పోషక విలువలు గల ఆహారం తిని ఆరో గ్యంగా ఉండాలన్నారు. కార్యక్రమంలో సిడిపిఒ, పర్యవేక్షకులు, కార్యకర్తలు, సిబ్బంది పాల్గొన్నారు.

### కొత్తపేట

పౌష్టికాహారం ఇంటింటి వ్యవహారం అంటూ పోషకాహార ప్రాముఖ్యతను ఆసుపత్రికి వచ్చే గర్భిణీలకు ర్యాలీ సెక్టార్పరిధిలో అవగాహన కల్పించారు. ప్రధానమంత్రి సురక్షిత్ మాతృత్వ యోజన(పిఎంఎస్ఎంవై)లో భాగంగా తొలుత సామాజిక ఆరోగ్య కేంద్రానికి వచ్చిన వారందరికి భోజనాలు ఏర్పాటు చేసి ఆరోగ్య విషయాలుపై అవగాహన కల్పించి వైద్యసిబ్బందితో కలసి ఆరోగ్య పరీక్షలు నిర్వహించారు. కాన్పు సమయంలో ఎదురయ్యే ప్రమాదాలను తగ్గించాలంటే ప్రతి స్త్రీ కడుపుతో ఉన్నప్పుడు దగ్గరలో ఉన్న ఆరోగ్య కేంద్రానికి వెళ్ళి కాన్పుఅయ్యేవరకు ప్రతి నెలా విధిగా పరీక్షలు చేయించుకోవాలన్నారు. మంచి బలాన్ని ఇచ్చే ఆహారాన్ని అనగా అందుబాటులో ఉన్న పాలు, పండ్లు, కూరలు, మాంసం, చేపలు, పప్పుధాన్యాలు తీసుకోవాలన్నారు. గర్భంతో ఉన్నప్పుడు తినకూడని ఆహారం ఏదీవుండదని, తనకూ కడుపులో బిడ్డను కాపాడుకోవడానికి మంచి తిండి అవసరమ న్నారు. ప్రాజెక్టు పరిధిలోని ప్రతి సెక్టార్లోను అంగన్వాడీ





కేంద్రం ఉన్న ప్రతి గ్రామంలోనూ పోషణ మాసోత్సవ వేడుకలు ప్రతిష్టాత్మకంగా నిర్వహించి లబ్దిదారులను ఆలోచింపచేసారు.

**సామర్లకోట**

గర్భిణీలు, పాలిచ్చే తల్లులు చిన్నారుల పోషక ఆరోగ్య అవగాహన కల్గించటానికి పెద్ద ఎత్తున పట్టణంలో ర్యాలీ నిర్వహించారు. ఈ అవగాహన ర్యాలీని ప్రాజెక్టు డైరెక్టర్ సుఖజీవన్‌బాబు జెండా ఊపి ప్రారంభించారు. పట్టణంలోని పలు వీధులలో



తిరుగుతూ గర్భిణీల్లో రక్తహీనత రాకుండా ఎలాంటి జాగ్రత్తలు పాటించాలి పెరిగే పిల్లలు ఎలాంటి శక్తినిచ్చే ఆహారం తీసుకోవాలి, బాలింతగా ఉన్నప్పుడు ఎటువంటి ఆహారం భుజిస్తే బిడ్డకు సంతృప్తిగా తల్లిపాలు ఇవ్వచ్చు అనే అంశాలపై అవగాహన కల్గించారు. పరిసరాల శుభ్రతపై కూడా చైతన్యం నింపి ఆలోచింపచేసారు. మనం భుజించే ఆహారంలో ఎన్ని రకాల ప్రయోజనాలుంటాయో వివరించారు. కార్యక్రమంలో సిడిపిఒ సూపర్‌వైజర్లు అంగన్‌వాడీ కార్యకర్తలు, లబ్దిదారులు సైతం పాల్గొన్నారు.

**రాజవొమ్మంగి**

ప్రాజెక్టు పరిధిలోని గిరిజన గ్రామాల్లో పోషణ మాసోత్సవ వేడుకలను ఘనంగా నిర్వహించడమేకాక కార్యక్రమం యొక్క ముఖ్య ఉద్దేశ్యం లబ్దిదారులకు చేరువ చేయటంలో సఫలీకృతులయ్యారు అని చెప్పాలి. జడ్డంగి, రేవతిపాలెం, మర్రిపాలెం ఎబి కాలనీ, దుర్గానగర్, పులిగోగులపాడు మొదలగు గ్రామాల్లో





అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా సేవలు పొందుతున్న ప్రతి ఇంటిని టచ్ చేసి పోషకాహారంపై ఉన్న ప్రాముఖ్యతను తెలియచేసారు. పిల్లల బరువులు తూయటం గర్భిణీస్త్రీలు ఉంటే వారు ఎలాంటి ఆహారం తీసుకుంటున్నారు తదితర అన్ని వివరాలు సేకరించి సంపూర్ణ అవగాహన కల్గించారు అనటంలో సందేహం లేదు. వైద్యఆరోగ్యశాఖ అధికారుల సహాయంతో ప్రతి కుటుంబాన్ని సందర్శించి వారి ఆరోగ్య స్థితిగతులను అడిగి తెలుసుకున్నారు. క్రమమైన పద్ధతిలో ఆహార అలవాట్లు ఉంచుకోవాలని ఆయన సూచించారు. కార్యక్రమంలో అంగన్‌వాడీ సూపర్‌వైజర్లు, కార్యకర్తలు పెద్ద ఎత్తున పాల్గొని విజయవంతం చేసారు.

**రాయవరం**

ప్రతి నెల రెండవ వారంలో ఆరోగ్య కేంద్రాలకు వచ్చే గర్భిణీలకు ప్రధానమంత్రి మాతృత్వ సురక్ష అభియాన్‌లో భాగంగా భోజనాలు ఏర్పాటు చేసి వచ్చినవారందరికీ ఆరోగ్య విషయంపై అవగాహన కల్పించారు. గర్భిణీగా ఉన్నప్పుడు తీసుకోవాల్సిన జాగ్రత్తలుపై అందరికి అర్థమయ్యే రీతిలో వివరించారు. గర్భిణీగా ఉన్నప్పుడు తీసుకునే సరైన పోషణ మూలంగానే తల్లి ఆరోగ్యం మరియు శిశువు శారీరక మానసిక అభివృద్ధికి తోడ్పడటమే కాకుండా వారి ఎదుగుదల, ఆరోగ్యం, చదువు నేర్చుకునే సామర్ధ్యం మరియు వారి ఉత్పాదకశక్తి మీద కూడా ప్రభావం చూపు



తుంది అన్నారు. ప్రతిరోజు ఆకుకూరలు, చిరుధాన్యాలు లాంటివి తీసుకోవాలన్నారు. విశ్రాంతి కూడా అవసరమన్నారు. అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా అందించే పోషకాహారాన్ని క్రమం తప్పకుండా భుజించి ఆరోగ్యవంతులుగా ఉండాలన్నారు. కార్యకర్తలు, సూపర్‌వైజర్లు పాల్గొన్నారు. బిక్కవోలు, కిర్లంపూడి సెక్టార్ పరిధిలో సైతం పలు కార్యక్రమాలు నిర్వహించారు.

### పెద్దాపురం

ప్రజలు పోషకాహారం తినగలగడం అనేది జాతి అభివృద్ధికి సూచిక అని రాబోయే తరాలు జీవించి, ఆరోగ్యంగా ఉండి వృద్ధి సాధించాలంటే పౌష్టికాహారం భుజించటం చాలా అవసరమని సిడిపిఒ అన్నారు. గర్భిణిగా ఉన్న సమయంలో తీసుకునే ఆహారంపైనే ఆరోగ్యం ఆధారపడి ఉంటాదని, రక్తహీనతకు గురి అయ్యే అవకాశాలు తక్కువగా ఉంటాయన్నారు. సరైన



పోషకాలు తీసుకోకపోతే నెలలు నిండకముందే ప్రసవం అయ్యే ప్రమాదం ఉందన్నారు. పోషణ మాసోత్సవాల్లో భాగంగా ప్రాజెక్టు పరిధిలోని ఒక సెక్టారులో ఏర్పాటు చేసిన అవగాహన కార్యక్రమానికి వైద్య ఆరోగ్యశాఖ, మెప్మా, ఆర్‌డబ్ల్యూఎస్ తదితర శాఖలు పాల్గొని జయప్రదం చేసారు.

### రంగంపేట

అంగన్‌వాడీ కేంద్రాల్లో గర్భవతుల కోసం ఉద్దేశించి అందిస్తున్న ఆహారాన్ని క్రమం తప్పకుండా భుజించి ఆరోగ్యవంతులుగా



ఉండాలని సిడిపిఒ లక్ష్మి చెప్పారు. గర్భిణీలు సమతుల ఆహారం తగిన మోతాదులో తీసుకోకపోతే కాన్పు సమయంలో కష్టం అవటమే కాక పుట్టబోయేబిడ్డ సంపూర్ణ ఆరోగ్యంతో ఉండరన్నారు. పోషణ మాసోత్సవంలో భాగంగా ప్రాజెక్టుపరిధిలో పలు కార్యక్రమాలు నిర్వహించారు. ఈ ఏడాది పోషణ మాసోత్సవాల్లో ఐదు అంశాలను ప్రధానంగా తీసుకుని అవగాహన కల్పించారు. పోషణకుగల ప్రాముఖ్యతను, లోపపోషణ లేకుండా ఉండాలంటే ఏమి చేయాలి ఏమితినాలి అనే అంశాలపై లబ్దిదారుల్లో అవగాహన కల్పించారు. పర్యవేక్షకులు, కార్యకర్తలు పాల్గొన్నారు.

### పిఠాపురం

శిశువులు గర్భిణీ, బాలింతల్లో పోషణస్థాయిని మెరుగుపర్చేందుకు నిర్దేశించిన కార్యక్రమాలు సక్రమంగా అమలు చేసి పిఠాపురం ప్రాజెక్టు ముందు వరుసలో ఉంది. పోషణ మాసోత్స



వాల్లో భాగంగా అధికారులు నిర్దేశించిన కార్యక్రమాలు క్యాలెండర్‌లో సూచించిన విధంగా చేసి నిర్దేశించిన నియమ నిబంధనలను పాటించి లబ్దిదారుల్లో చైతన్యం నింపారు. పిల్లలు కిశోరి బాలికలు, గర్భిణీ బాలింతల ఆరోగ్యం, పోషణ కోసం తీసుకోవాల్సిన చర్యల గురించి వివరించారు. సిడిపిఒ విజయ ఫ్లొరెన్స్ మాట్లాడుతూ స్త్రీ గర్భవతిగా ఉన్నప్పుడు 4వ నెలలో మొదలు పెట్టి కాన్పు అయ్యే వరకు 180 ఐరన్ మాత్రలు వేసుకోవాలని అంటే రోజుకొక ఐరన్ మాత్ర తప్పక వేసుకోవాలని సూచిం





చారు. అలాగే గర్భిణీ ప్రతివారం చేతిగోర్లు కత్తిరించుకోవటం, ఆహారం తినే ముందు మరుగుదొడ్డికి వెళ్ళి వచ్చాక చేతులు శుభ్రంగా కడుక్కోవడం అత్యంత ముఖ్యం అన్నారు. కార్యక్రమాల్లో ప్రాజెక్టు పరిధిలోని పర్యవేక్షకులు, కార్యకర్తలు అందరూ పాల్గొని కార్యక్రమాలు సందడిగా నిర్వహించారు.

## కపిలేశ్వరం ప్రాజెక్టు

తల్లి ఆరోగ్యమే బిడ్డకు రక్ష, బాలింతలు, గర్భిణీలు తగిన జాగ్రత్త పాటిస్తే పుట్టే బిడ్డ లేదా పుట్టిన బిడ్డతో పాటు వారు ఆరోగ్యంగా ఉంటారని సిడిపిఒ విజయశ్రీ అన్నారు. పోషణ మాసోత్సవ వేడుకల్లో భాగంగా ప్రాజెక్టు పరిధిలోని మండపేట సెక్టార్‌లో కార్యక్రమం నిర్వహించారు. మరణాల రేటు తగ్గిం



చటం తీవ్ర రుగ్మతల శాతాన్ని నియంత్రించటం డ్రాప్ అవుట్లను తగ్గించడం, పౌష్టికాహారాన్ని అరికట్టడం అనేవి ఐసిడిఎస్ లక్ష్యాలు అని, అంగన్‌వాడీ సేవలను లబ్దిదారులు క్రమం తప్పకుండా వినియోగించుకోవాలన్నారు. అంగన్‌వాడీ కార్యకర్తలు వారి వారి కేంద్రాల పరిధిలోని గర్భిణీ బాలింతలకు రోజువారీ ఆహారంలో పోషకవిలువల శాతం ఎంత ఉండాలనే దానిపై తల్లికి కుటుంబానికి అవగాహన కల్గించటం ముఖ్యమన్నారు. కార్యక్రమంలో సూపర్‌వైజర్, కార్యకర్తలు పాల్గొన్నారు.




## కాకినాడ అర్బన్ ప్రాజెక్టు

తూర్పుగోదావరి జిల్లా కేంద్రమైన కాకినాడ అర్బన్ ప్రాజెక్టులో పోషణ మాసోత్సవంలో భాగంగా నగరంలో విద్యార్ధినీ విద్యార్ధులతో ర్యాలీ నిర్వహించారు. పోషకాహార అవసర



తను తెలియజేసే ఈ ర్యాలీ ఆహుతులను ఆలోచింపచేసింది. అనంతరం స్ధానిక కలెక్టర్ కార్యాలయంలో పౌష్టికాహారం ప్రాముఖ్యతను తెలియపర్చే విధంగా పోషకాలు గల వంటకాలను ప్రదర్శనగా ఉంచారు. అందుబాటులో దొరికే ఆకుకూరలు, కాయగూరలు, పండ్లతో ఎలాంటి ఆహారం తయారు చేసుకో వచ్చో సామాన్యులకు సైతం అర్ధమయ్యే రీతిలో ఏర్పాటు చేసి వీక్షకులను ఆకట్టుకున్నారు. పిడి సుఖజీవన్‌బాబు స్వయంగా



స్టాల్‌ని సందర్శించి సందర్శకులకు పోషకాహార ప్రాముఖ్యతను తెలియచేయటం విశేషం. కార్యక్రమంలో సిడిపిఒలు, సూపర్ వైజర్లు, అంగన్‌వాడీ కార్యకర్తలు పాల్గొన్నారు.

## శంఖవరం

గర్భిణీలు వేళకు సరైన పోషకాహారం భుజిస్తే తన ఆరోగ్యంతోపాటు పుట్టబోయే బిడ్డ ఆరోగ్యం కూడా బాగుంటుందని పార్లమెంటు సభ్యులు వంగా గీత అన్నారు. శంఖవరం ప్రాజెక్టు ఏలేశ్వరంలో ఏర్పాటు చేసిన కార్యక్రమానికి ముఖ్యఅతిథులుగా హాజరైన ఎంపి, ఎమ్మెల్యేలు ప్రసంగించారు. ఆడపిల్లలకు చిన్న





తనంలో పెరిగే వయస్సులో మంచి ఆహారం పడితే ఆరోగ్యంగా ఉంటారని చెప్పారు. కడుపులో ఉన్నప్పుడు ఆరోగ్య పరీక్షలు కూడా ముఖ్యమే అన్నారు. అనంతరం పిల్లలకు అన్నప్రాసనం, గర్భిణీలకు సీమంతాలు నిర్వహించారు. కార్యకర్తలు తయారు



చేసిన పౌష్టికాహారాన్ని ప్రదర్శనగా ఉంచారు. కార్యక్రమంలో సిడిపిఒ ఊర్మిళ, సూపర్‌వైజర్లు, వైద్య ఆరోగ్య అంగన్‌వాడీ సిబ్బంది పాల్గొన్నారు.

## రాజోలు ప్రాజెక్టు

పోషకాహారం అనేది మహిళలకు చాలా మంచిదని పోషకాహార లోపంతో ప్రజలు జీవన ప్రమాణాలు తక్కువగా ఉండి అనారోగ్య పరిస్థితులు చోటుచేసుకుంటున్నాయని రాజోలు





ఎమ్మెల్యే రాపాక వరప్రసాదరావు అన్నారు. ఆరోగ్యం మనిషి జీవితంలో అత్యుత్తమ ప్రమాణమని ప్రతివారు ఆరోగ్యంగా జీవించాలన్నారు. పోషణ మాసోత్సవాల్లో భాగంగా స్థానిక అంబేద్కర్ భవనంలో ప్రత్యేక కార్యక్రమం ఏర్పాటు చేశారు. కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా విచ్చేసిన ఎమ్మెల్యే మాట్లాడుతూ మహిళా శిశు సంక్షేమం నిమిత్తం ప్రభుత్వాలు కోట్లాది రూపాయలు వెచ్చిస్తుందన్నారు. అనంతరం అంగన్‌వాడీలు తయారుచేసిన పౌష్టికాహారం ప్రదర్శన తిలకించి గర్భిణీలకు సామూహిక సీమంతాలు నిర్వహించారు. కార్యక్రమంలో సిడిపిఒ రమాదేవి, ఎంపిడిఒ గిడ్ల భీమారావు, డిప్యూటీ తహశీల్దార్ శ్రీనివాస్, ఎంఈవో గోపాలకృష్ణ, ఆరోగ్య సిబ్బంది, అంగన్‌వాడీ కార్యకర్తలు పాల్గొన్నారు.

## ముమ్మిడివరం

మన ఆరోగ్యంతోపాటు పరిసరాల పరిశుభ్రత అంతే ముఖ్యమని స్థానిక ఎమ్మెల్యే పొన్నాడ వెంకట సతీష్‌కుమార్ అన్నారు. పోషణ మహా వేడుకల్లో భాగంగా సిడిపిఒ ఏర్పాటు చేసిన ప్రత్యేక కార్యక్రమానికి వచ్చిన ఎమ్మెల్యే చేతుల శుభ్రతపై అవగాహన కల్పించారు. భోజనానికి ముందు శుభ్రంగా చేతులు కడుక్కోవాలని లేదంటే మనం చేతులతో తింటున్న ఆహారం ద్వారా చాల రకాల క్రిములు లోపలికి చేరి అనారోగ్యాన్ని కలిగిస్తాయ







న్నారు. అలాగే స్త్రీలు నాణ్యమైన పోషకాహారాన్ని భుజించాలి. గర్భిణీస్త్రీలు ఆహారం విషయంలో పలు జాగ్రత్తలు పాటించాల న్నారు. పాలిచ్చే తల్లులు కూడా బలవర్ధకమైన ఆహారం భుజించాలన్నారు. కార్యక్రమంలో సూపర్‌వైజర్లు, కార్యకర్తలు, ఇతర శాఖల అధికారులు పాల్గొన్నారు.

## విశాఖపట్నం జిల్లా

ఆరోగ్యపరంగా బలమైన సమాజ నిర్మాణంలో అంగన్‌వాడీ కేంద్రాలు కీలకపాత్ర పోషిస్తున్నాయని, తల్లి కడుపులోఉన్నప్పటి నుండే భావి జీవితానికి వ్యక్తిత్వానికి మంచి బాటలు వేసే పని అంగన్‌వాడీ కేంద్రాలు చేస్తున్నాయని అందరికి తెలియచేసేలా పోషణ మాసోత్సవాలను అత్యంత ఘనంగా నిర్వహించారు. జిల్లాలోని ప్రతి ప్రాజెక్టులో వినూత్నమైన కార్యక్రమాలు ఏర్పాటు చేసి పోషణ అభియాన్ విశిష్టతను మరోమారు అందరికి తెలియ చెప్పారు. మహిళలు, శిశువులు ఆరోగ్యం, సంక్షేమం పట్ల మహిళా శిశు సంక్షేమశాఖ చేస్తున్న కృషి అందరికి అర్ధమయ్యే రీతిలో కార్యక్రమాలు ఏర్పాటు చేసి శెహభాష్ అనిపించారు. ఆరోగ్యవంతమైన సమాజ నిర్మాణం పౌష్టికాహారంతోనే సాధ్య మవుతుందని చాటిచెప్పారు. గర్భిణులు, బాలింతలు పోషకాహార ప్రాముఖ్యతపై లోతైన అవగాహన కల్పించారు. పరిసరాల పరిశు భ్రత, శుభ్రమైన నీరు, గాలి, వెలుతురు ఉండాలని చెప్పారు. ప్రాజెక్టు డైరెక్టర్ సీతామహాలక్ష్మి మాట్లాడుతూ జీవితపు అన్ని దశలలోనూ మంచి పోషకాహారం అవసరమని అన్నారు. పసి తనం, బాల్యం, కౌమార దశలలో సంతృప్తికరమైన ఎదుగుదలకు తగినంత పోషకాహారం కావాలి. గర్భవతులు, బాలింతలకు వారి అవసరాలకు తగినట్లుగా సమతుల్య ఆహారంలేదా సమగ్ర ఆహా రం లభించాలన్నారు. ఆహారంలో ఉండాల్సిన పోషక పదార్థాలు, పిండి పదార్థాలు, క్రొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజ లవణాలు, నీరు ఇవన్నీ సమపాళ్ళల్లో ఉండాలి. అప్పుడే మనమంతా సంపూర్ణ ఆరోగ్యవంతులుగా ఉంటామని సూచించారు.

### సబ్బవరం ప్రాజెక్టు

ప్రభుత్వం గర్భిణీలకు, చిన్నారులకు, కౌమార బాలికలకు, పౌష్టికాహారం అందించటానికి కోట్లాది రూపాయలు ఖర్చు చేస్తుం దని పథకాలు సమర్ధవంతంగా అమలై పోషకాహారం అర్హులకు చేరితేనే రాబోయే తరం ఆరోగ్యకరంగా ఉంటుందని శాసన సభ్యులు ఆరీఫ్ రాజు అన్నారు. విశాఖ జిల్లా సబ్బవరం ప్రాజె క్టులో జరిగిన పోషణ మాసోత్సవ వేడుకలకు ఆయన ముఖ్య



అతిథిగా హాజరై ప్రసంగించారు. పేద కుటుంబాల్లో ఆరోగ్య పరిరక్షణపై సరైన అవగాహన లేక ఆర్థిక స్తోమత లేక పోషక విలువలున్న ఆహారం తీసుకోలేకపోతున్నారని అలాంటి వారి కోసం అంగన్‌వాడీ కేంద్రాలు ఉన్నాయన్నారు. సరైన ఆహారపు అలవాట్లు లేక గర్భస్థ శిశు దశ నుంచే ఆరోగ్యపరమైన సమస్యలు ఏర్పడుతున్నాయని పేర్కొన్నారు. తల్లి బిడ్డ సంక్షేమమే ధ్యేయంగా అంగన్‌వాడీలు పనిచేయాలన్నారు. అనంతరం కార్యక్రమానికి హాజరైన అందరిచేత పోషకాహారం ఇంటింటి వ్యవహారం అనే అంశంపై ప్రతిజ్ఞ చేయించారు. ప్రాజెక్టు పరిధిలోని అంగన్‌వాడీ కార్యకర్తలు తయారు చేసిన వివిధ రకాల పోషకాలు కల్గిన వంటకాలను ప్రదర్శనగా ఉంచగా వాటిని ఎమ్మెల్యే వీక్షించి వివరాలు అడగటంతో పాటు రుచి కూడా చూసారు. కార్య క్రమంలో స్థానిక సిడిపిఓ కెవిఎల్ఆర్ కుమారి, తహశీల్దార్, ఎంపి డివో, అనుబంధ శాఖల అధికారులు పాల్గొన్నారు.





## పెందుర్తి

పోషణ మహాలో భాగంగా పెందుర్తి ప్రాజెక్టు పరిధిలోని ఎస్ఎం పురం సెక్టార్ నందు పోషణ మాసోత్సవ కార్యక్రమం నిర్వహించారు. ఈ సందర్భంగా పోషకాలు పుష్కలంగా లభ్య



మయ్యే ఆహార పదార్థాలు తయారుచేసి ప్రదర్శన ఏర్పాటు చేసి అవగాహన కల్గించారు. సిడిపిఒ సంతోషి మాట్లాడుతూ కాలాను గుణంగా లభించే పండ్లు, ఆకుకూరలు తినటం మూలంగా ఆరోగ్యానికి మంచిదని చెప్పారు. రోగ నిరోధకశక్తిని పెంపొం దించే ఆహారం తీసుకోవాలని సూచించారు. తమ ప్రాజెక్టు పరిధి లోని ప్రతి అంగన్‌వాడీ కేంద్రం ద్వారా నెలరోజులపాటు పౌష్టికా



హారంపై గ్రామగ్రామాన అవగాహన కల్గించామన్నారు. సూపర్ వైజర్లు, కార్యకర్తలు పాల్గొన్నారు. పోషణ అభియాన్ పేరుతో హృదయాకారంలో చేసిన ఆకృతి పలువురిని ఆకర్షించింది.

## చింతపల్లి

పౌష్టికాహారంపై తల్లులకు అవగాహన కల్గించాలని చింతపల్లి ప్రాజెక్టు పరిధిలోని గొలుగొండ తహశీల్దార్ వెంకటేశ్వరరావు అన్నారు. పోషణ మహాల్‌లో భాగంగా స్థానిక ఎంపిడిఒ కార్యాల యంలో అంగన్‌వాడీలతో సమావేశం నిర్వహించారు. ఈ సంద ర్భంగా ఆయన మాట్లాడుతూ పోషణ మాసోత్సవాల్లో భాగంగా



ప్రతి గ్రామంలో అవగాహన కార్యక్రమాలు చేపట్టాలన్నారు. అనంతరం సిడిపిఒ జివి రమణి చేతుల శుభ్రతపై లబ్దిదారులకు



అవగాహన కల్పించారు. మనం తీసుకుం ఆహారంతోపాటు ఆరోగ్య విషయంలోనూ శ్రద్ధ వహించాలన్నారు. కార్యక్రమంలో ఐసిడిఎస్‌తోపాటు ఇతర శాఖల అధికారులు పాల్గొన్నారు.

# చిత్తూరు జిల్లా

జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే ప్రకారం దేశవ్యాప్తంగా 3వ వంతు పిల్లలు పౌష్టికాహార లోపంతో బాధపడుతున్నారని అలాగే మాతా శిశుమరణాల రేటు కూడా ఆ ఏటికాఏడు ఎక్కువ అవుతున్నాయని వీటిని అరికట్టేందుకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఎన్నో సంక్షేమ పథకాలు అమలు చేస్తుందని వాటిని సద్వినియో గం చేసుకోవాలని అవగాహన కల్గించారు. జిల్లాలో 21 ప్రాజెక్టు లుండగా ప్రతి ప్రాజెక్టు పరిధిలోను పోషణ మాసోత్సవ వేడుకలు అట్టహాసంగా నిర్వహించారు. నెలరోజులుపాటు కార్యక్రమాలు నిర్వహించి లబ్దిదారుల్లో ఆలోచనను రేకెత్తించారు.

## చిత్తూరు రూరల్

చిత్తూరు రూరల్ ప్రాజెక్టు పరిధిలో పోషణ వేడుకలో భాగంగా పోషణమహా ఘనంగా నిర్వహించారు. స్థానిక అంబేద్కర్‌నగర్





కెఎన్ కాలనీలో ఏర్పాటు చేసిన కార్యక్రమంలో సిడిపిఒ షెహనాజ్ పాల్గొని గర్భిణీలకు అవగాహన కల్గించారు. గర్భిణీ స్త్రీ వెయ్యి రోజుల సంరక్షణపై వారికి అర్థమయ్యే రీతిలో చెప్పారు. నేడు దేశంలో పోషకాహారలోపం పెద్ద సమస్యగా ఉందని అందరూ దీనిని అధికమించాలంటే శరీరానికి అవసరమయ్యే మంచి పోషకాలు ఉన్న ఆహారం భుజించాలి అన్నారు. రక్తహీనత లోపాన్ని అధికమించాలన్న మంచి ఆహారం భుజించాలి అన్నారు. ఈ సందర్భంగా గర్భిణీలకు సీమంతాలు నిర్వహించారు. కార్యక్ర మంలో పర్యవేక్షకులు, కార్యకర్తలు పాల్గొన్నారు.

## మదనపల్లె

పోషణ అభియాన్‌లోగల ప్రాముఖ్యమైన ఐదు అంశాలు గూర్చి ప్రత్యేక కార్యాచరణ చేపట్టారు. పోషకాహార లోపాలు, రక్తహీనతపై అవగాహన కల్గించారు. బాలల సంక్షేమం కోసం వివిధ శాఖలు అమలు చేస్తున్న కార్యక్రమాలను సమన్వయపరిచి ఆరోగ్యవంతమైన బావిభారత పౌరులను తీర్చిదిద్దడమే పోషణ అభియాన్ మౌలిక లక్ష్యమని చెప్పారు. కళాజాతా ద్వారా కూడా పోషణకు గల ప్రాముఖ్యతను వెల్లడించారు. ప్రాజెక్టు పరిధిలోని అనపగుట్ట సెక్టార్ గొల్లపల్లి దళితవాడలో ఏర్పాటు చేసిన ఈ కార్యక్రమం ప్రత్యేక ఆకర్షణగా నిలిచింది. గర్భిణీ బాలితంతలు



నాణ్యమైన పోషకాహారాన్ని భుజించి ఆరోగ్యంగా జీవించాలన్నారు. మహిళా శిశు సంక్షేమ శాఖ ద్వారా అమలవుతున్న కార్యక్రమాలను అర్హులైన ప్రతి ఒక్కరు సద్వినియోగం చేసుకోవాలని పిలుపునిచ్చారు. కార్యక్రమంలో సూపర్‌వైజర్లు, కార్యకర్తలు పాల్గొన్నారు.

## పుంగనూరు ప్రాజెక్టు

ప్రాజెక్టు పరిధిలోని పుంగనూరు రూరల్ ప్రాజెక్టు పరిధిలో పోషణ అభియాన్ పోషణ మాసోత్సవ కార్యక్రమాలు మెప్మా



సహకారంతో చైతన్య ర్యాలీ నిర్వహించి పోషకాహార ప్రాముఖ్యతను తెలియచేసారు. మనం తీసుకునే ఆహారం మనకు ఏ విధంగా మేలుచేస్తుంది. ఎలాంటి ఆహారం తీసుకోవాలో చెప్పారు. గర్భవతులు, బాలింతలు తీసుకునే ఆహారంలో పోషకాలు తప్పనిసరిగా ఉండేటట్లు చూసుకోవాలన్నారు. మాతాశిశు సంరక్షణే ధ్యేయంగా పనిచేస్తున్న అంగన్‌వాడీ కేంద్రాలను అర్హులైన ప్రతివారు సద్వినియోగం చేసుకోవాలన్నారు. సిడిపిఒ, సూపర్‌వైజర్లు, కార్యకర్తలు పాల్గొని ర్యాలీ జయప్రదం చేసారు.

## చిన్నగొట్టిగల్లు

ప్రాజెక్టు పరిధిలోని రొంపిచర్ల మండలంలో పోషణ మాసోత్సవం నిర్వహించారు. కౌమార బాలికలకు అవగాహన కల్గిం









చారు. స్త్రీ జీవితంలోనే కాదు సమాజ గమనంలో విలువైన సంపద కౌమార బాలికలను వారి ఆరోగ్య విషయంలోనూ పోషకాహార విషయంలోను తగు జాగ్రత్తలు పాటించాలన్నారు. అలాగే మహిళలు ఆరోగ్య విషయంపై శ్రద్ధవహించాలన్నారు. గర్భిణీగా ఉన్నప్పుడు నాణ్యతతో కూడిన పోషకాహారం తిని పుట్టబోయే శిశువుకు మంచి ఆరోగ్యం అందించాలన్నారు. క్రమం తప్పకుండా ఆరోగ్య పరీక్షలు చేయించుకోవాలన్నారు.

### నగరి ప్రాజెక్టు

ప్రపంచంలోనే అతిపెద్ద పోషకాహార సంస్థ అయిన సమగ్ర శిశు అభివృద్ధి పథకం (ఐసిడిఎస్) 1975 నుంచి అమలవుతున్న ప్పటికి దేశంలో కౌమారగర్భం, రక్తహీనత, పోషకాహార లోపాలు, అకాల మరణాలు తీవ్ర ఆవేదనకు కలిగిస్తున్నాయని గర్భిణీలు, బాలింతలు పోషకాహారంపై అవగాహన పెంచుకుని మేలైన ఆహారం తీసుకుని ఆరోగ్యంగా ఉండాలని స్థానిక శాసన సభ్యురాలు ఆర్‌కె రోజా అన్నారు. నగరి ఐసిడిఎస్ ప్రాజెక్టులో పోషణ మాసోత్సవ వేడుకలకు ముఖ్యఅతిథిగా విచ్చేసి గర్భిణీ, బాలింతలకు ఆరోగ్య విషయాలపై అవగాహన కల్గించారు. అనంతరం అందుబాటులో దొరికే కాయగూరలు, ఆకుకూరలతో ఏర్పాటు చేసిన పౌష్టికాహార ప్రదర్శనను తిలకించారు. అక్కడ నుండి ఏకాంబరకుప్పంలో నూతనంగా నిర్మించిన అంగన్‌వాడీ



భవనాన్ని ప్రారంభించారు. కార్యక్రమంలో సిడిపిఒ కృష్ణవేణి, ఇతర శాఖల అధికారులు, అంగన్‌వాడీలు పాల్గొన్నారు.

## కర్నూలు జిల్లా

తల్లి బిడ్డ ఆరోగ్యానికి ప్రాధాన్యతనిచ్చి వారి ఆరోగ్యాన్ని కాపాడాల్సిన బాధ్యత ఎంతైనా వుందని గుర్తించిన ప్రభుత్వాలు వారందరికి సరైన పోషణ అందించటానికి భారత ప్రభుత్వం ప్రారంభించిన పోషణ అభియాన్ ద్వారా ప్రత్యేక కార్యాచరణ చేపట్టిందని వారి ఆరోగ్య సంరక్షణే ధ్యేయంగా ప్రభుత్వం వివిధ కార్యక్రమాలు చేస్తుందని ప్రాజెక్టు డైరెక్టర్ లీలావతి అన్నారు. జిల్లాలోగల 16 ప్రాజెక్టులలో పోషణ మంత్ వేడుకలు వివిధ రూపాల్లో నిర్వహించారు. గ్రామీణ ప్రాంతాల్లో పౌష్టికాహారలోపం వల్ల గర్భం దాల్చే సమయంలో తల్లులు రక్తహీనతకు గురిఅవు తున్నారని ఈ సమస్య వల్ల కాన్పు సమయంలో కూడా తల్లితో సహా బిడ్డకు ప్రాణాపాయం ఏర్పడుతుందని ఇలాంటి సంఘ టనలు సంభవించకుండా వుండాలంటే గర్భం దాల్చిన వెంటనే సరైన పద్ధతిలో క్రమమైన రీతిలో పౌష్టికాహారం భుజించాలనే విషయాన్ని మరోసారి ఈ మాసోత్సవాలు ద్వారా తెలియజేసారు. క్రియాశీల ఆరోగ్యపద జీవనం గడిపేందుకు వీలుగా ప్రతిఒక్కరూ పోషక విలువలున్న ఆహారాన్ని భుజించాలి అన్నారు. ఆహారం, పోషకాలు తోడు, మరుగుదొడ్డి వసతి, శుభ్రమైన తాగునీరు అందుబాటులో ఉండాలన్నారు. తల్లి బిడ్డల ఆహారం, ఆరోగ్యం విషయంలో తగినంత శ్రద్ధ తీసుకోకపోతే వ్యాధుల బారిన పడే ప్రమాదముందని తెలియచెప్పారు. జిల్లా స్థాయిలో, మండల స్థాయిలో, గ్రామీణ స్థాయిలో అనేక కార్య క్రమాలు నిర్వహించి పోషకాహార ప్రాముఖ్యతను మరోసారి అందరికి గుర్తు చేసారు.

### ఆలూరు ప్రాజెక్టు

మహిళ ఆరోగ్యానికి ముఖ్యంగా గర్భవతిగా, బాలింతగా ఉన్నప్పుడు మెరుగైన పోషకాహారం తప్పనిసరిగా అవసరమని ఆలూరు సీడీపీఓ చెప్పారు. పుట్టబోయే శిశువులు ఆరోగ్యంగానూ





పోషకాహార లోపం లేకుండా మరణానికి గురికాకుండా సరైన వృద్ధితో పెరగాలంటే గర్భవతులు వైవిధ్యమైన ఆహారం చాలా అవసరమన్నారు. గర్భందాల్చిననాటి నుండి వెయ్యి రోజులపాటు సరైన పోషక విలువలున్న ఆహారం భుజించాలన్నారు. సరక్షితం కాని ఆహారం భుజించలేక పోవటం మూలంగా ఆహారం ద్వారా సంక్రమించే జబ్బులు ప్రమాదానికి దారితీస్తాయన్నారు. పోషకా



హారంతో పాటు ఆరోగ్యపరీక్షలు అంతే ముఖ్యమన్నారు. ఈ సందర్భంగా గర్భిణీలకు సీమంతాలు నిర్వహించారు. లబ్దిదారులతో పాటు సూపర్‌వైజర్లు, కార్యకర్తలు పాల్గొన్నారు.

## కోయలకుంట్ల

గర్భంలో పెరిగే శిశువు తల్లి మీద పరాన్న జీవిగా పెరుగుతుందని, తల్లి శరీరంలోని పోషకాలను లాక్కొంటుందని, కాబట్టి





తల్లి సరిపడా పోషకాహారాన్ని తినకపోతే బిడ్డ తల్లి శరీరంలోని పోషకవిలువల్ని లాక్కోవడం మూలంగా ఆమె శరీరం బలహీన పడుతుంది. బరువు తక్కువగా ఉంటుంది. బలహీనపడిన తల్లి గర్భం తాలూకా ఒత్తిడిని తట్టుకోలేదు కాబట్టి దీర్ఘకాలిక పోషకాహార లోపం రక్తహీనతకు దారితీస్తుందని దాని ఫలితంగా గర్భస్రావాలు, నెలలు నిండకముందే జననాలు, బిడ్డ తల్లి గర్భంలోనే చనిపోవటం లాంటి ప్రమాదాలు సంభవిస్తాయి కాబట్టి గర్భం దాల్చిన నాటి నుండి పోషక విలువలు పుష్కలంగా ఉన్న ఆహారాన్ని భుజించాలి సిడిపిఒ ఆగ్నేష్ ఏంజిల్ చెప్పారు. పోషణ మాసోత్సవాల్లో భాగంగా స్థానికంగా పలు కార్యక్రమాలు ఏర్పాటు చేసి గర్భిణీలు బాలింతలు, కిశోరి బాలికలకు అవగాహన కల్పించారు. ప్రతి ఏటా చేస్తున్న పోషణ మాసోత్సవాలు మాతా శిశు మరణాలను అరికట్టాలనే ప్రధాన ధ్యేయంతో ఇంత అట్టహాసంగా కార్యక్రమాలు నిర్వహిస్తున్నారన్నారు. సూపర్‌వైజర్లు, కార్యకర్తలు పాల్గొన్నారు.

## ఆళ్ళగడ్డ

పంచాయతీ పరిధిలోని ప్రీస్కూల్ ఆవరణలో పోషణ మాసోత్సవాలు నిర్వహించారు. ఈ సందర్భంగా సూపర్‌వైజర్ పద్మావతమ్మ మాట్లాడుతూ గర్భిణీ బాలింతలు ఆరోగ్యం, పోషణ విషయంలో తీసుకోవాల్సిన జాగ్రత్తలు వివరించారు. రక్తహీనత రాకుండా ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి, గర్భం దాల్చిన







నాటి నుండి వెయ్యి రోజులు అతి జాగ్రత్తగా ఉండాలన్నారు. అందుబాటులో ఉన్న ఆహారం భుజించి పోషణ స్థాయిని మెరుగు పర్చుకోవాలన్నారు. రక్తహీనత నివారణ నిమిత్తం గర్భిణీలు ఐరన్ ట్యాబ్లెట్లు వేసుకోవాలన్నారు. కార్యక్రమంలో కార్యకర్తలు పాల్గొన్నారు.

## శ్రీకాకుళం జిల్లా

స్త్రీలు, పిల్లలు మెరుగైన జీవనస్థాయి సమాజానికి దేశ అభివృద్ధికి ఖచ్చితమైన సూచిక అని భావించిన ప్రభుత్వాలు పోషణ లోప నివారణకు కోట్లాది రూపాయలు వెచ్చిస్తుందని పిల్లలు, గర్భిణీ, బాలింతల ఆరోగ్యం కోసం ప్రత్యేకమైన శ్రద్ధ కనబరుస్తుందని శ్రీకాకుళం ప్రాజెక్టు డైరెక్టర్ డాక్టర్ జి జయదేవి చెప్పారు. సమాజ నిర్మాణంలో మహిళల స్థానం మరింత ఉన్నతంగా తీర్చిదిద్దేందుకు అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా నాణ్యమైన పోషకాహారాన్ని అందించి తల్లి, బిడ్డ సంక్షేమం కోసం వినూత్న కార్యక్రమాలు అమలు చేస్తున్నామన్నారు. పోషణ మాసోత్సవాల్లో భాగంగా జిల్లాలోగల 18 ప్రాజెక్టులలోనూ పలు కార్యక్రమాలు నిర్వహించారు. చిన్నారులు, మగువల ఆరోగ్య వికాసానికి ప్రభుత్వం న్యూట్రీషన్ మిషన్ ఏర్పాటు చేసి బలవర్ధకమైన ఆహారాన్ని సరఫరా చేస్తున్నారు. దీనిమూలంగా గర్భిణీ బాలింతల్లో సమతులాహారం చేరి వారి ఆరోగ్య పరిరక్షణకు దోహదపడుతూ రక్తహీనతకు దూరం అవుతున్నారన్నారు. వ్యక్తిగత పరిశుభ్రత లోపించటం వలన కూడా భయంకరమైన వ్యాధులు వస్తాయని కాబట్టి పరిసరాల పరిశుభ్రతపై అవగాహన కలిగి ఉండేలా చేతులు శుభ్రతపై అవగాహన ర్యాలీలు నిర్వహించారు. అలాగే యుక్తవయస్సు బాలికల్లో రక్తహీనత పెద్ద సమస్యగా ఉందని కౌమార బాలికలు ఎలాంటి ఆహారం తీసుకోవాలనే విషయాలుపై కళాశాల పాఠశాల స్థాయిలో చైతన్య సదస్సులు, ర్యాలీలు నిర్వహించారు. బాల్యవివాహాలు, బాలల అక్రమరవాణా, మరియు బాలలపై వేధింపులు వలన కలిగే దుష్ప్రయోజనాలపై అవగాహన కల్గించారు. జిల్లాలో శ్రీకాకుళం, ఇచ్ఛాపురం అర్బన్ ప్రాజెక్టులు కాగా సీతంపేట ఏజెన్సీ ప్రాజెక్టు కూడా ఉంది. మొత్తానికి పోషణ మహావేడుకగా జరిగింది అని చెప్పాలి.

### రణస్థలం

మనిషి జీవితంలో అత్యంత ముఖ్యమైన దశ కౌమార ప్రాయం అని బాలలు బాల్యం నుంచి యవ్వనంలోకి అడుగుపెట్టే దశ కాబట్టి ఈ దశలోనే పిల్లలు అనేకరకాల శారీరక, మానసిక, ఉద్వేగభరితమైన మార్పులు చోటు చేసుకుంటాయని కావున బలమైన పోషక విలువలున్న ఆహారం భుజించాలని సిడిపివో



ఝూన్సీ అన్నారు. పోషణ మాసోత్సవ వేడుకలు సందర్భంగా జెఆర్‌పురం సెక్టారులో కిశోరి బాలికలతో ర్యాలీ నిర్వహించారు. ఈ సందర్భంగా సిడిపిఓ వారికుండే హక్కులు, బాల్యవివాహాలు వలన కలిగే నష్టాలు, విద్య, ఆవశ్యకత, పోషకాహార ప్రాధాన్యత, బహిష్టు పట్ల ఉన్న అపోహలు ఆ సమయంలో తీసుకోవాల్సిన జాగ్రత్తలు కోసం అర్థం అయ్యేలా చెప్పారు. అనంతరం గరిక పాలెం అంగన్‌వాడీ కేంద్రంలో ఆరోగ్య కార్యకర్తలతో కలిసి యోగాసానం ఆరోగ్యం పట్ల అవగాహనను గర్భిణీల్లో కల్గించారు. కార్యక్రమంలో సూపర్‌వైజర్లు, అంగన్‌వాడీ కార్యకర్తలు, గ్రామస్తులు పాల్గొన్నారు.





## శ్రీకాకుళం అర్బన్

పోషకాహార లోపంతో బాధపడే పిల్లల్ని, గర్భవతులు, బాలింతలను గుర్తించి పరిమిత స్థాయిలో కాకుండా వారిలోని రక్తహీనతను తరిమికొట్టేంత వరకు సమతుల ఆహారం అందేటట్లు చూడాల్సిన బాధ్యత అంగన్‌వాడీలపై ఉందని స్థానిక ఎమ్మెల్యే ధర్మన ప్రసాదరావు అన్నారు. పోషణ మహాలోభాగంగా పట్టణంలో ఏర్పాటు చేసిన కార్యక్రమానికి ఎమ్మెల్యే ముఖ్య అతిథిగా హాజరై ప్రసంగించారు. పౌష్టికాహారలేమితో కృశిస్తున్న వారి సంఖ్యను తగ్గించటంలో వెనుకబడిపోకుండా మరింత శ్రద్ధతో



పనిచేస్తానికి ఇలాంటి కార్యక్రమాలు ఉపయోగపడతాయన్నారు. జిల్లా కలెక్టర్ జె నివాస్ మాట్లాడుతూ లోపపోషణ, తీవ్రలోప పోషణగల పిల్లలనుగుర్తించి వారిలో వస్తున్న మార్పులను గమనించి ఆ మార్పులకు అనుగుణంగా వారికి ప్రత్యేకపోషణ అందించాలన్నారు. పిడి డాక్టర్ జయదేవి మాట్లాడుతూ జాతీయ ఉత్పాదకతకు, అభివృద్ధికి, పిల్లల పోషణ, ఆరోగ్యం, వారి భద్రత కీలకమైందన్నారు. సిడిపిఓ శోభారాణి, ఇతర శాఖల ఉద్యోగులు, సూపర్‌వైజర్లు, అంగన్‌వాడీ ఆరోగ్య కార్యకర్తలు పాల్గొన్నారు.

## కోటబొమ్మాళి

దేశంలో కౌమార గర్భం, రక్తహీనత, పోషకాహార లోపాలు అకాల మరణాలు తీవ్ర ఆవేదనను కలిగిస్తున్నాయని రక్షిత



తాగునీరు, సౌకర్యాలలేమి, పారిశుధ్య లోపం, సరైన పోషకాహారం అందకపోవటం, అవగాహన రాహిత్యం తదితరాలు స్త్రీల ఆరోగ్యంపై తీవ్ర ప్రభావం చూపుతుందని మండల ప్రత్యేక అధికారి నారాయణరావు అన్నారు. పోషణ మహా వేడుకల్లో భాగంగా స్థానిక ప్రాజెక్టు కార్యాలయంలో ఏర్పాటు చేసిన కార్యక్రమానికి నారాయణరావు ముఖ్యఅతిథిగా హాజరై ప్రసంగించారు. అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా సరఫరా చేస్తున్న పోషకాహారాన్ని భుజించి మాతాశిశువులు ఆరోగ్యంగా ఉండాలన్నారు. అనంతరం అంగన్‌వాడీ కార్యకర్తలు తయారుచేసిన వివిధ రకాల



పోషక విలువలున్న ఆహార పదార్థాలను తిలకించారు. ప్రాజెక్టు పరిధిలోని కార్యకర్తలంతా పాల్గొని పోషకాహారలోపాన్ని తగ్గిస్తామని ప్రతిజ్ఞ చేసారు. కార్యక్రమంలో సిడిపిఓ అనురాధ, ఎంపిడివో రాజ్యలక్ష్మి, విద్యాశాఖ, ఆరోగ్యశాఖ సిబ్బంది పాల్గొన్నారు.

## రాజం ప్రాజెక్టు

రాష్ట్ర కార్యదర్శి దమయంతి పోషణ మాసోత్సవ వేడుకలకు హాజరైనారు. ప్రాజెక్టు పరిధిలోని బీద్దం సెక్టార్‌లో ఏర్పాటు చేసిన కార్యక్రమానికి ఆమె ముఖ్యఅతిథిగా హాజరై లబ్దిదారులతో ముఖాముఖిగా మాట్లాడారు. జిల్లాలో జరుగుతున్న కార్యక్రమాలుపై ఆరా అడిగి తెలుసుకున్నారు. అంగన్‌వాడీ ద్వారా అందుతున్న సేవలు విషయంపై లబ్దిదారులు తమతమ మనోభావాలకు







చెప్పారు. కార్యక్రమంలో విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం పిడిలతోపాటు ఆర్‌జెడి పాల్గొన్నారు.

## నరసన్నపేట

గర్భిణీ స్త్రీలు పోషకాహార విషయంలో సరైన శ్రద్ధ వహించకపోతే వారికి పుట్టే బిడ్డలు తక్కువ బరువుతో పుట్టడం వల్ల తరచూ అనారోగ్యాలకు లోప పోషణకు గురి అయ్యే అవకాశం ఉంటుందని రహదారులు భవనాల శాఖ మంత్రి ధర్మాన కృష్ణదాస్ అన్నారు. పోషణ మాసోత్సవాలు సందర్భంగా ప్రాజెక్టు పరిధిలో ఏర్పాటు చేసిన పోషణ మాసోత్సవ కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా హాజరైన మంత్రి మాట్లాడుతూ ప్రపంచ ఆరోగ్య సంస్థ యునిసెఫ్ తదితర సంస్థలు ఇచ్చిన నివేదికలు ప్రకారం ప్రపంచ వ్యాప్తంగా నేటికి 11 సెకన్లకు ఒక గర్భిణీ, బాలింత, లేదా పసిబిడ్డ తనువు చాలించటం విచారకరమన్నారు. అనంతరం బాలామృతం పంపిణీ చేసి చిన్నారులకు అన్న ప్రాసనం చేశారు. సిడిపిఒ కె. అనంతలక్ష్మి మాట్లాడుతూ పోషణ సంబంధ విషయాలలో గర్భిణీ, బాలింతలు తీసుకోవాల్సిన జాగ్రత్తలు గూర్చి వివరించారు. ఈ సందర్భంగా అంగన్‌వాడీ కార్యకర్తలు తయారు చేసిన వివిధ రకాల పోషకాలతో కూడిన వంటకాల ప్రదర్శనను మంత్రి తిలకించి ప్రతీది రుచి చూసి



వాటి వివరాలు తెలుసుకున్నారు. మంత్రి వెంట వైద్య, విద్య, ఆరోగ్య, పంచాయతీరాజ్ శాఖల అధికారులు, ఐసిడిఎస్ సూపర్‌వైజర్లు, సిబ్బంది పాల్గొన్నారు.

## కాశీబుగ్గ

పోషణ అభియాన్‌లో భాగంగా సెప్టెంబరు నెల అంతా ప్రాజెక్టుల వారీగా ఎలాంటి కార్యక్రమాలు నిర్వహించాలి, ప్రజలకు ఎలాంటి సందేశం ఇవ్వాలి అనే అంశాలతో ప్రాజెక్టు డైరెక్టర్ డాక్టర్ జయదేవి కాశీబుగ్గ ప్రాజెక్టులో సిడిపిఒలతో సమీక్షా సమావేశం నిర్వహించారు. జిల్లాలో వినూత్నంగా కార్యక్రమాలు చేసి గుర్తింపు పొందాలని పిలుపునిచ్చారు. ప్రభుత్వం ఎంతో ప్రతిష్ఠాత్మకంగా అమలు చేస్తున్న పోషణ అభియాన్ క్షేత్రస్థాయిలో అర్హులందరికి చేరేలా సిడిపిఒలు దృష్టి సారించాలన్నారు. సిబ్బంది అందరూ అంకితభావంతో పనిచేసి జిల్లాకి మంచి పేరు తీసుకురావాలని హితవు పలికారు. ఏరోజు ఏ కార్యక్రమం నిర్వహించాలి అనేదానిపై సిడిపిఒలు ముందుగా ప్రణాళిక సిద్ధం చేసుకుని ఆ విధంగా కార్యక్రమాలు విజయవంతం చేయాలన్నారు. కార్యక్రమంలో అందరూ సిడిపిఒలు, ఎసిడిపిఒలు, సిబ్బంది పాల్గొన్నారు.







# కృష్ణా జిల్లా

శరీరానికి అవసరమైన ఆహారాన్ని భుజించటం వలన ప్రతి ఒక్కరూ ఆరోగ్యంగా ఉంటారని, మహిళలు అనగా గర్భిణీలు, బాలింతలు ఇంకా మెరుగైన ఆహారం భుజించి శక్తివంతులుగా ఉండాలని ఇన్‌ఛార్జి ప్రాజెక్టు డైరెక్టర్ ఐ.ఆర్. భార్గవి అన్నారు. పోషణ అభియాన్‌లో భాగంగా పోషణ మాసోత్సవం ఉత్సాహ భరితంగా ఈ జిల్లాలో నిర్వహించి పలు కార్యక్రమాలు చేశారు. పోషణ అభియాన్ అమలులో ఇటీవల జాతీయ స్థాయిలో కృష్ణా జిల్లా నగదు బహుమతితో పాటు అవార్డును దక్కించుకుంది. ఈ జిల్లా పోషణ అభియానంలోకి రెండవ దశలో వచ్చినాగానీ బహుమతి రావటంతో సిబ్బంది అంతా ఎంతో ఉత్సాహంతో పోటీపడి తమ ప్రాజెక్టులలో కార్యక్రమాలు నిర్వహించారు. శరీరానికి సరైన పోషకాలు అందకపోవడం, నేరుగా మరణం సంభవించకపోయినప్పటికీ దాని కారణంగా పిల్లలు తక్కువ బరువుతో పుట్టడం, రోగ నిరోధక శక్తి తగ్గిపోవడం వంటి ఇబ్బం దులు వస్తున్నాయని, జాగ్రత్తగా ఉండాలనే సందేశం ఇచ్చేలా పలు కార్యక్రమాలు నిర్వహించారు. పిల్లల్లో శారీరక, మానసిక అభివృద్ధి ఉండాలంటే మంచి ఆహారాన్ని తినిపించాలన్నారు. పెరిగే పిల్లలకు శక్తినిచ్చే ఆహారాన్ని అందించాలని చెప్పారు. పోషక లోప వ్యాధులు, అంటువ్యాధుల వల్ల చాలామంది పిల్లల్లో శారీరక, మానసిక పెరుగుదల తగ్గిపోతుందని, ఈ విషయంలో జాగ్రత్తలు పాటించాలన్నారు. గర్భిణీ 100 రోజులు పాటు తగు జాగ్రత్తలు పాటిస్తే పండంటి బిడ్డ– తాను కూడా ఆరోగ్యంగా ఉంటుందని చెప్పారు. జిల్లా వ్యాప్తంగా ఉన్న అన్ని ప్రాజెక్టులలో ఈ కార్యక్రమాలు నిర్వహించి ప్రజల్ని ఆలోచింపచేశారు.

### గుడివాడ

మాతా శిశు మరణాలను గణనీయంగా తగ్గించటంపై ప్రతివారు దృష్టి సారించాలని, అప్పుడే ఆరోగ్యవంతమైన సమాజ





స్థాపన జరుగుతుందని ఐసిడిఎస్ డైరెక్టర్ కృతికాశుక్లా అన్నారు. పోషణ మాసోత్సవాల్లో భాగంగా కృష్ణా జిల్లా గుడివాడ ప్రాజెక్టుకి విచ్చేశారు. స్థానిక చెంచుపేట అంగన్‌వాడీ కేంద్రంలో ఏర్పాటు చేసిన కార్యక్రమానికి హాజరై గర్భిణీ, బాలింతలతో మాట్లాడారు. ప్రభుత్వం నిర్దేశించిన ప్రకారం గర్భిణీలు, బాలింతలకు క్రమ పద్ధతిలో పోషకాహారాన్ని అందిస్తున్నామన్నారు. చిన్నపిల్లలకు, మహిళలకు, గర్భిణీలకు సరైన పోషణ అందించటానికి 2017లో భారత ప్రభుత్వం నేషనల్ న్యూట్రిషనం మిషన్ ఏర్పాటు చేసి వారికి ప్రత్యేక పోషణ అందిస్తున్నారు. రక్తహీనతతో బాధపడు తున్న బాలలు, కిశోర బాలికలు, గర్భిణీలు, బాలింతలకు ఇది ఎంతో ఉపయోగపడుతుందన్నారు. శరీరానికి కావలసిన ఆహారం కన్నా తక్కువ ఆహారం తీసుకునే పరిస్థితి దీర్ఘకాలం జరిగితే తక్కువ పౌష్టికస్థాయి ఏర్పడుతుందని, దానివలన పెద్ద లలో శ్రమ శక్తి తగ్గటం, తద్వారా ఉత్పాదకత జరుగుతుంద న్నారు. పౌష్టికాహారలోపం నివారించటం వలన వర్ధమాన దేశా లలో శిశు మరణాల శాతం గణనీయంగా తగ్గించవచ్చన్నారు. అలాగే అక్షయపాత్ర పైలెట్ ప్రాజెక్టుగా గుడివాడలోని ప్రతి అంగన్‌వాడీ కేంద్రానికి బలవర్ధకమైన పోషకాహారాన్ని అందిస్తు న్నామని, రాష్ట్రంలోని అన్ని అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా గర్భిణీ, బాలింతలు, చిన్నారులకు, రక్తహీనత లేకుండా వారిలో హిమో గ్లోబిన్ శాతాన్ని పెంచేవిధంగా ప్రభుత్వం చర్యలు చేపట్టింద న్నారు. అనంతరం అంగన్‌వాడీ కేంద్రానికి వచ్చే గర్భిణీలు బాలింతలతో శుక్లా మాట్లాడి మెనూ ప్రకారం భోజనం వండి వడ్డిస్తున్నారా? సక్రమంగా అంగన్‌వాడీల సేవలు అందుతు న్నాయా, గుడ్లు, పాలు ఇస్తున్నారా అనే విషయాలపై ఆరాతీశారు. అంతకుముందురోజు పోషణవేడుకల్లో భాగంగా సిడిపిఒ సముద్ర వేణి గర్భిణీలకు సీమంతాలు నిర్వహించారు. డైరెక్టర్ వెంట కృష్ణా జిల్లా ఇన్‌ఛార్జి పిడి ఐ.ఆర్.భార్గవి, రిటైర్డ్ పిడి కృష్ణకుమారి, సిపిపి జిల్లా మేనేజరం హెప్సీబా, సూపర్‌వైజర్లు పాల్గొన్నారు.



## విసన్నపేట

అమ్మ ఆరోగ్యంగా ఉంటేనే బిడ్డ ఆరోగ్యంగా ఉంటుందని, కాబట్టి గర్భవతిగా ఉన్నప్పుడు సరైన ఆహారం క్రమపద్ధతిలో భుజించినట్లయితే లోపపోషణ దరిచేరదని సిడిపిఒ లలితకుమారి చెప్పారు. పోషణ మాసోత్సవం సందర్భంగా విసన్నపేట ప్రాజెక్టులో నిర్దేశించిన కార్యక్రమాలు అన్నీ ఎంతో చక్కగా చేశారు. దానిలో భాగంగా 18 మంది గర్భిణీలకు దాతల సహకారంతో ఎంతో వేడుకగా సీమంతాలు నిర్వహించారు. ఈ కార్యక్రమానికి అతిధిగా విచ్చేసిన డాక్టరు విజయలక్ష్మి మాట్లాడుతూ గర్భిణీల్లో సమీకృత వైఫల్యాలు కారణంగా దేశంలో పసిమొగ్గలు నేలరాలి



పోతున్నాయని, శిశువులకు ప్రాణగండం గర్భస్థ దశ నుంచే ప్రారంభమవుతుందని, కనుక గర్భం దాల్చిన విషయం తెలిసిన దగ్గర నుండి పోషక విలువలతో కూడిన ఆహారాన్ని భుజించాన్నారు. క్రమం తప్పకుండా ఆరోగ్య పరీక్షలు చేయించుకోవాలన్నారు. అప్పుడే సుఖ ప్రసవం జరిగి తల్లి బిడ్డ కూడా క్షేమంగా ఉంటారని చెప్పారు. సీమంతాలు నిర్వహణకు ముందుకు వచ్చిన దాతను అభినందించారు. కార్యక్రమంలో సూపర్‌వైజర్లు నాగమణి, కృష్ణకుమారి, భవాని, కార్యకర్తలు, సిబ్బంది పాల్గొన్నారు.



## మైలవరం ప్రాజెక్టు

పోషణ ప్రాముఖ్యతను తెలియపర్చేందుకు కృష్ణా జిల్లా మైలవరం ప్రాజెక్టులో అంగన్‌వాడీ కార్యకర్తలు వినూత్న రీతిలో సైకిల్ ర్యాలీ నిర్వహించారు. గర్భిణీ, పాలిచ్చే తల్లుల్లో పోషక ఆరోగ్య అవగాహన కలిగించారు. పేద ప్రజల అభ్యున్నతి సాధన కోసం రూపొందించిన పోషణ అభియాన్ కోసం అందరికి అర్థమయ్యేరీతిలో చెప్పారు. మైలవరం ప్రాజెక్టు గుంటుపల్లి సెక్టార్‌లోని అంగన్‌వాడీ కార్యకర్తలంతా వినూత్నంగా ఆలోచించి సైకిల్ ర్యాలీ నిర్వహించి ప్రజలను ఆలోచింపచేశారు. గర్భిణీలు, బాలింతలు పోషకాహారం భుజించటం వలన కలిగే లాభాలు



వివరంగా చెప్పారు. గర్భం దాల్చిన విషయం తెలుసు కున్న రోజు నుండి మనం భుజించే ఆహారంపై దృష్టి సారించి సమతుల్య ఆహారం తీసుకోవాలన్నారు. అంతకుముందు ప్రాజెక్టు స్థాయిలోను చైతన్యర్యాలీలు నిర్వహించారు. పిల్లలకు బాలామృతం సరఫరా చేవారు. ఈ కార్యక్రమాలకు స్థానిక ఎమ్మెల్యే వసంతకృష్ణప్రసాద్ పాల్గొన్నారు. సిడిపిఒ రత్నకుమారి, టాటా ట్రస్ట్ జిల్లా మేనేజర్ మస్తాన్, సూపర్‌వైజర్లు, లక్ష్మీకాంతం, ప్రశాంతి, అన్నమ్మ, రమాదేవి, కార్యకర్తలు పాల్గొన్నారు.





### కంకిపాడు

గర్భిణీలు సంపూర్ణ ఆహారం తీసుకున్నప్పుడే సంపూర్ణ ఆరోగ్యవంతమైన శిశువుకు జన్మనివ్వగలరని వీరవల్లి ప్రాధమిక ఆరోగ్య కేంద్రం అధికారి డాక్టర్ ఎస్.ఎస్.ఎస్.గోపాల్ అన్నారు. పోషణ మాసోత్సవం సందర్భంగా కంకిపాడు ప్రాజెక్టు పరిధిలోని రామవరప్పాడు పోలేరమ్మ ఆలయ సమీపంలోని అంగన్‌వాడీ కేంద్రంలో గర్భిణీలకు సామూహిక సీమంతాలు నిర్వహించారు. ఈ సందర్భంగా సిడిపిఒ ఉమాదేవి మాట్లాడుతూ గర్భవతిగా నమోదు నుంచి బిడ్డకు 2 సంవత్సరాలు పూర్తి అయ్యేవరకు సంరక్షణతో పాటు అనుబంధ ఆహారం అందించాలన్నారు.



సీమంతాల కార్యక్రమానికి ఆర్యవైశ్య కమిటీ సభ్యులు కటకం నాగేశ్వరరావు చీరలు, పసుపు, కుంకుమ, గాజులు, పూలు, పండ్లు సరఫరా చేశారు. స్థానిక పార్లమెంటు సభ్యులు వి.బాల



శౌరి పుట్టినరోజును పురస్కరించుకుని దాసరి కిరణకుమార్ మిత్రమండలి ఆర్గనైజర్ ఆళ్ళ సురేష్ రామవరప్పాడులోని అంగన్‌వాడీ కేంద్రాలకు 185 కుర్చీలు బహుకరించారు.

## ప్రకాశం జిల్లా

తల్లి ఆరోగ్యమే బిడ్డకు రక్ష అని గర్భిణీలు, బాలింతలు తగిన జాగ్రత్తలు పాటిస్తే పుట్టే బిడ్డతోపాటు వారు ఆరోగ్యంగా ఉంటారని ప్రాజెక్టు డైరెక్టర్ విశాలాక్షి అన్నారు. పోషణ అభియాన్‌లో భాగంగా పోషణ మహా కార్యక్రమాలు జిల్లా అంతా నిర్వహించారు. జిల్లాలోని 21 ప్రాజెక్టులలో పోషణ మాసోత్సవ వేడుకలు వైభవోపేతంగా నిర్వహించారు. ఆయా ప్రాజెక్టుల పరిధిలో స్థానిక ప్రజాప్రతినిధులు, ప్రభుత్వ ఉన్నత అధికారులు పాల్గొని విజయవంతం చేసారు. గర్భిణీ స్త్రీలు కొన్ని అపోహల మూలంగా అవసరమైన పోషకాలు తినక, సరైన పోషకాలు అందక నానా ఇబ్బందులుపడతారు. వాస్తవంగా గర్భిణీలు కాలానుగుణంగా దొరికే అన్ని ఆహార పదార్థాలు, ఆకుకూరలు, పండ్లు తినవచ్చు అని చెప్పారు. ప్రజల్లో పౌష్టికాహారంపై ఉన్న అపోహలు తొలగించారు. గ్రామీణ ప్రాంతాల్లో నేటికి పోషకాహార ప్రాధాన్యం తెలియకపోవటం సరిగా ఆహారం తీసుకోకపోవటంతో తల్లులు, పిల్లలు అనేక రుగ్మతలకు గురిఅవుతున్నారన్నారు. పోషకాహార లోపనివారణకు, రోగ నిరోధకశక్తిని పెంపొందించుకోవటానికి ప్రధానంగా కూరగాయలు, ఆకుకూరలు తీసుకోవాలన్నారు. మనకు అందుబాటులో ఉంటూ, నిత్యం మన పెరట్లో మన కళ్ళ ముందు కనిపించే కూరగాయలే మన ఆరోగ్యానికి శ్రీరామరక్ష అని విశాలాక్షి అన్నారు. మంచి ప్రణాళికతో సమయానుకూలంగా ఆహారం తీసుకుంటే తక్కువ ఖర్చుతో పోషకాహారం అందుతుందన్నారు. ప్రధానంగా పండ్లు, ఆకుకూరల్లో అధికంగా పోషకాలు లభిస్తాయన్నారు. మహిళా శిశు సంక్షేమ శాఖ ఎంతో ప్రతిష్టాత్మకంగా ప్రతిఏటా పోషణ వేడుకను సెప్టెంబరు మాసంలో నిర్వహిస్తుందని పోషకాహారంపై అందరూ అవగాహన పెంచుకుని ఆరోగ్యంగా ఉండాలని పిలుపునిచ్చారు. మధ్యతరగతి, సామాన్య ప్రజలు కూడా తమ బడ్జెట్‌కి అనుకూలంగా రోగనిరోదకశక్తిని పెంపొందించే పోషకాహారాన్ని తీసుకోవాలన్నారు. పోషక విలువలతో కూడిన ఆహారాన్ని తీసుకోవటంలో నిర్లక్ష్యంవహిస్తే చాలా ఇబ్బందులు పడాల్సివస్తుందన్నారు.

### మార్కాపురం అర్బన్ ప్రాజెక్టు

పోషకాహారంతోపాటు వ్యక్తిగత పరిశుభ్రత పరిసరాల శుభ్రత కూడా అంతే ప్రాధాన్యం అని సిడిపిఒ లక్ష్మీదేవి అన్నారు.





ముఖ్యంగా అంటువ్యాధులు సోకే అవకాశం తొందరగా ఉంటుందని జాగ్రత్తలు వహించాలన్నారు. పోషణ మాసోత్సవం సందర్భంగా మార్కాపురం అర్బన్ ప్రాంతంలో స్థానిక పురపాలక సంఘం పారిశుధ్య సిబ్బందితో కలిసి చేతులు శుభ్రం చేసుకునే క్రమపద్ధతిని ఆచరణలో చేసి చూపించి ప్రజలకు అవగాహన కల్పించారు. చేతులు శుభ్రంగా లేకపోతే మనం తినే ఆహారం



కలుషితం అవుతుందన్నారు. అంటువ్యాధుల నుండి పిల్లలను కాపాడాలంటే పోషకాహారం లోపం లేకుండా అన్ని రకాల ఆహారాలు తినిపించాలన్నారు. ముఖ్యంగా చేతులు కడుగుకోవటం అలవాటు చేయాలన్నారు. అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా శిశవులు గర్భిణీలు, బాలింతలకు నాణ్యమైన పోషకాహారం అందిస్తున్నామన్నారు. అర్హులైన ప్రతి వారు క్రమం తప్పకుండా అంగన్‌వాడీ కేంద్రాల్లో ఇచ్చే ఆహారాన్ని భుజించి ఆరోగ్యంగా ఉండాలన్నారు. కార్యక్రమంలో పర్యవేక్షకులు, అంగన్‌వాడీ కార్యకర్తలు పాల్గొన్నారు.

## గుంటూరు జిల్లా

పోషకాహారలోపం మూలంగా గర్భిణీ బాలింతల్లో లోపపోషణ కలిగి వ్యాధి నిరోధకశక్తి తగ్గి రక్తహీనతకు గురి అవుతారని ప్రాజెక్టు డైరెక్టర్ ప్రసన్నలక్ష్మి అన్నారు. పోషణ మహా సందర్భంగా సెప్టెంబరు మాసమంతా జిల్లాలో ఉన్న 23 ప్రాజెక్టులలో



రోజువారి రూపొందించన కార్యక్రమాలు క్రమం తప్పకుండా చేయాలన్నారు. గ్రామస్థాయిలో, మండలస్థాయిలో డివిజన్ స్థాయిలో జిల్లా స్థాయిలో అవగాహన కార్యక్రమాలు నిర్వహించాలన్నారు. జిల్లా కలెక్టర్ శామ్యూల్ ఆనందకుమార్ సైతం మహిళా శిశు సంక్షేమశాఖతో అనుబంధమున్న వివిధ ప్రభుత్వ శాఖల అధికారులతో ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేసి పౌష్టికాహార



మాసోత్సవాన్ని జయప్రదం చేయాలన్నారు. గర్భిణీలు, బాలింతలు ఆరోగ్య విషయంలో శ్రద్ధ వహించి వైద్యపరీక్షలు సైతం చేయించాలన్నారు. అంగన్‌వాడీ కేంద్రాలలో నిర్వహించే సామూహిక వేడుకలకు సైతం అనుబంధశాఖల అధికారులు హాజరై లబ్దిదారుల్లో అవగాహన కల్పించాలన్నారు. ఆ విధంగానే జిల్లాలో పోషణ మాసోత్సవ వేడుకలు ఘనంగా నిర్వహించారు. మాతా శిశు మరణాల నివారణకు, రక్తహీనత రాకుండా ఎలాంటి జాగ్రత్తలు పాటించాలి, గర్భిణీగా ఉన్నప్పుడు తీసుకోవాల్సిన అనుబంధ పోషకాహారం, పరిసరాల పరిశుభ్రత, వ్యక్తిగత శుభ్రత, కౌమార బాలికలు ఎలాంటి ఆహారం తీసుకోవాలి, చేతులు పరిశుభ్రత, పిల్లలకు ఎలాంటి ఆహారం ఇవ్వాలి తదితర అంశా లపై పూర్తి అవగాహన కల్పించారు. పోషణ అభియాన్ పేరుతో పోషణ మాసోత్సవ వేడుకలు లబ్దిదారుల్లో ఉత్సాహాన్ని నింపాయి. గత ఏడాది కంటే భిన్నంగా చేసి అందరిని ఆలోచింపచేసారు. పోషణ రహిత జిల్లాగా మార్చటానికి కృషి చేస్తున్నారు. హేట్సాప్ గుంటూరు ఐసిడిఎస్ అని చెప్పక తప్పదు.

### రాజుపాలెం

గర్భిణీ బాలింతలకు క్రమపద్ధతిలో పోషకాహారం అందించి వారి ఆరోగ్య పరిరక్షణకు దోహదపడాలని స్థానిక ఎమ్మెల్యే అంబటి రాంబాబు అన్నారు. పోషణ మాసోత్సవాల్లో భాగంగా రాజుపాలెం ఐసిడిఎస్ ప్రాజెక్టులో జరిగిన కార్యక్రమానికి ఎమ్మెల్యే ముఖ్యఅతిథిగా హాజరైన ఆయన మాట్లాడుతూ శిశు







వుల్లో పోషకాహారలోపాలను గర్భిణీ బాలింతల్లోని రక్తహీనతకు కనిష్ఠస్థాయికి తగ్గించేందుకు అంగన్‌వాడీ కేంద్రాలు నెలకొల్ప బడ్డాయన్నారు. అర్హులైన ప్రతివారు అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా అందుతున్న సేవలను పొందాలన్నారు. ముఖ్యంగా గర్భిణీలు



ఆరోగ్యం, ఆహార విషయంలో జాగ్రత్తగా ఉండాలన్నారు. అందు బాటులో దొరికే ఆహారంతోనే ఆరోగ్యంగా ఉండాలన్నారు. అనం తరం గర్భిణీలకు సీమంతాలు నిర్వహించారు. కార్యక్రమంలో సిడిపిఒ సులోచన, సూపర్‌వైజర్లు, అంగన్‌వాడీ కార్యకర్తలు పాల్గొన్నారు.

## నల్లపాడు ప్రాజెక్టు

గర్భిణీలు, బాలింతలు తినే ఆహారంలో అన్ని విటమిన్లు ఉండేలా చూసుకోవాలని గుంటూరు జిల్లా జాయింట్ కలెక్టర్ సత్యనారాయణ అన్నారు. 14-49 ఏళ్ళ మధ్య వయసున్న మహి ళల్లో సగానికంటే ఎక్కువమంది రక్తహీనత సమస్య ఎదుర్కొం టున్నారని యునిసెఫ్ లాంటి నివేదికలు తేల్చి చెబుతున్నాయ న్నారు. పోషణ అభియాన్ మాసోత్సవ కార్యక్రమాల్లో భాగంగా నల్లపాడు ప్రాజెక్టు కార్యక్రమం స్థానిక మహిళా ప్రాంగణంలో ఏర్పాటు చేసారు. కార్యక్రమానికి అతిథిగా విచ్చేసిన జెసి-2 మాట్లాడుతూ తాను గర్భిణీ అన్న విషయం తెలిసిన నాటి నుండి వెయ్యి రోజులపాటు తాను భుజించే ఆహారంపై దృష్టి పెట్టాలని, సమతుల ఆహారం తీసుకోవాలన్నారు. అలాగే ఐరన్ మాత్రలు వేసుకోవాలన్నారు. గ్రామస్థాయిలో అంగన్‌వాడీలు మాతా శిశు మరణాల నివారణకు ఎంతో కష్టపడుతున్నారని, మరింత దృష్టి



సారిస్తే పూర్తి శాతం వాటిని నివారించవచ్చునన్నారు. స్థానిక గృహ విజ్ఞాన కళాశాల (లామ్) టాటా ట్రస్టు సహాయ సహకారా లతో ఏర్పాటు చేసిన ఈ కార్యక్రమంలో కళాశాల యూత్ రక్త హీనత రాకుండా తీసుకోవాల్సిన జాగ్రత్తలపై నాటక రూపంలో ప్రదర్శించి అందరిని ఆలోచింపచేసారు. సిడిపిఒ మేరి భారతి మాట్లాడుతూ అంగన్‌వాడీ కేంద్రాలకు అందుతున్న సేవలను అర్హులైన ప్రతివారు సద్వినియోగం చేసుకోవాలన్నారు. అంగన్ వాడీ కార్యకర్తలు ఏర్పాటు చేసిన పౌష్టికాహార ప్రదర్శనను అతిథులు సందర్శించి వివరాలు అడిగి తెలుసుకున్నారు. ఈ సందర్భంగా టాటా ట్రస్టు ఉద్యోగులు మస్తాన్, అనూష, కార్యకర్త లకు బహుమతులు అందించారు.

## 75 త్యాళ్ళూరు ప్రాజెక్టు

ఒక మహిళ గర్భం దాల్చిన దగ్గరనుండి బిడ్డకు రెండు సంవత్సరాలు నిండే వరకు మధ్య ఉన్న కాలం వెయ్యి రోజులని కాబట్టి ఈ 1000 రోజులు చాలా ప్రాముఖ్యమని, తల్లి, బిడ్డకు







అందే పోషణ, ఆరోగ్య సంరక్షణ బిడ్డ జీవితకాలం ప్రభావం ఉంటుందని కాబట్టి గర్భిణీలు ఆహారం, ఆరోగ్యం విషయంలో జాగ్రత్తలు పాటించాలని ఐసిడిఎస్ సిబ్బంది పేర్కొన్నారు. పోషణ మాసోత్సవాల్లో భాగంగా 75 త్యాళ్ళూరు ప్రాజెక్టు కొండూరు



అంగన్‌వాడీ సెంటర్‌లో గర్భవతులకు అవగాహన సదస్సు ఏర్పాటు చేసి ఆరోగ్యం, పరిశుభ్రతపై వివరాలు తెలియ చెప్పారు. స్థానికులు, పెద్దలు సహా అందరూ వచ్చి ఈ వేడుకల్లో పాల్గొన్నారు.

## రేపల్లె ప్రాజెక్టు

కన్ను తెరిచిన ప్రతి శిశువు సంపూర్ణ వ్యక్తిగా ఎదగడం కోసం రేపటి పౌరులకు సమస్త సేవలు అందించాలన్న మహత్తర ఆశయంతో అవతరించిన అంగన్‌వాడీ కేంద్రాలను అర్హులైన ప్రతివారు సద్వినియోగం చేసుకోవాలని గుంటూరు జిల్లా వేమూరు శాసనసభ్యులు మేరుగ నాగార్జున చెప్పారు. మాతా శిశుమరణాల రేటును అదుపులో పెట్టడం పోషకాహారలోపాలు, బరువు తక్కువ పిల్లల సంఖ్య, కౌమార బాలికలు, గర్భవతుల్లో రక్తహీనత వీటి నియంత్రణే ధ్యేయంగా అంగన్‌వాడీ కేంద్రాలు పనిచేస్తున్నాయన్నారు. పోషణ మాసోత్సవంలో భాగంగా రేపల్లె ప్రాజెక్టు పరిధిలో జరిగిన ప్రత్యేక కార్యక్రమానికి ఎమ్మెల్యే ముఖ్యఅతిథిగా హాజరై ప్రసంగించారు. ఈ సందర్భంగా పౌష్టికాహార ఆవశ్యకత నిమిత్తం, దానివలన కలిగే ప్రయోజనాలు నిమిత్తం కార్యక్రమానికి హాజరైన ప్రతివారికి అర్థమయ్యేరీతిలో చక్కగా వివరించి చెప్పారు. అనంతరం సిడిపిఒ రాధాకృష్ణ ఏర్పాటు



చేసిన అన్నప్రాసనం, గర్భిణీలకు సామూహిక సీమంతాల్లో పాల్గొన్ని చిన్నారులకు అన్నప్రాసన చేయటమేకాక గర్భిణీలను ఆశీర్వదించారు. అక్కడ నుండి కార్యకర్తలు ఏర్పాటుచేసిన పోషకాహార ప్రదర్శన స్టాల్‌ని సందర్శించి ఏ పదార్థాన్ని ఎలా చేసారు, దేనితో చేసారు వాటిని భుజించటం మూలంగా కలిగే లాభాలు ఏమిటనేది తెలుసుకున్నారు. కార్యక్రమంలో సూపర్‌వైజర్లు, అంగన్‌వాడీ కార్యకర్తలు అనుబంధశాఖల అధికారులు పాల్గొన్నారు.

## విజయనగరం జిల్లా

మాతృత్వం ఒక వరం, బిడ్డకు జన్మ ఇవ్వడమంటే అమ్మ మరో జన్మ ఎత్తినట్టే అందుకే మాతృమూర్తుల రక్షణకు ప్రభుత్వం ప్రత్యేక చర్యలు తీసుకుంటుంది. దీనిలో భాగంగానే నేషనల్ న్యూట్రీషియన్ మిషన్ అనగా పోషణ అభియాన్ ఏర్పాటు చేసి పిల్లలు, గర్భిణీ, బాలింతలు, కౌమారలకు చక్కటి ఆరోగ్య పోషణ ఇస్తుందని విజయనగరం ప్రాజెక్టు డైరెక్టర్ రాజేశ్వరి అన్నారు. పోషణ మాసోత్సవాలను పురస్కరించుకుని జిల్లా అంతా పోషణ



సంబరాలు నిర్వహించారు. వైద్యఆరోగ్యశాఖతో కలిసి స్త్రీ శిశు సంక్షేమ శాఖ అధికారులు గర్భిణీ, బాలింతల నిమిత్తం ఎన్నో కార్యక్రమాలు అమలు పరుస్తున్నారని వాటిని ఉపయోగించుకోవాలని పిలుపునిచ్చారు. ప్రభుత్వం పేదలకు న్యాయమైన పౌష్టికాహారాన్ని అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా అందిస్తుందన్నారు. మహిళలను రక్తహీనత వేధిస్తుందని పేదింటి మహిళలు, శిశువులు తరచూ రక్తహీనతకు గురి అవుతున్నారని ఇలాంటి వారిని గుర్తించి పౌష్టికాహారం అందించేందుకు పోషణ అభియాన్ అనే ప్రత్యేక కార్యక్రమం వచ్చిందన్నారు. మాతా శిశు మరణాలను నివారించేందుకు ప్రభుత్వం చర్యలు చేపడుతోందని దానిలో భాగమే ఎఎహెచ్ అన్నారు. పోషకాహార లోపాన్ని అధికమిస్తే చిన్నారులు వయస్సుకు తగ్గ పొడుగు పెరిగే అవకాశాలు ఉంటాయన్నారు. యుక్తవయస్సు వచ్చే వరకు అన్ని రకాల ఆహార పదార్థాలు సక్రమంగా అందుతున్నాయో లేదో చూడాలని ఈ జాగ్రత్తలు పాటిస్తే వయస్సుకు తగిన ఎత్తు, బరువు సమకూరుతుందన్నారు. జిల్లాలో 17 ప్రాజెక్టులుండగా వాటిలో మూడు అర్బన్ ప్రాజెక్టులు, రెండు ట్రైబల్ ప్రాజెక్టులు మిగతావి రూరల్ ప్రాజెక్టులుగా ఉన్నాయి. మొత్తం అన్ని ప్రాజెక్టులలో నెలరోజుల పాటు వివిధ కార్యక్రమాలు నిర్వహించారు. ఈ జిల్లాకి ప్రిన్సిపల్ సెక్రటరీ దమయంతి వచ్చి జరుగుతున్న కార్యక్రమాలపై సంతృప్తి వ్యక్తం చేసారు. ఈ జిల్లాలో వరల్డ్ విజన్ ఇండియా సంస్థ ఒక ప్రాజెక్టును దత్తత తీసుకోవటం ఈ జిల్లాకి కలిసొచ్చే అంశం కావటం విశేషం. వరల్డ్ విజన్ పోషణ మాసోత్సవం పేరుతో గంట్యాడలో ఎన్నో కార్యక్రమాలు నిర్వహించారు.

## గంట్యాడ ప్రాజెక్టు

వరల్డ్ విజన్ ఇండియా స్వచ్ఛంద సంస్థ దత్తత తీసుకున్న గంట్యాడ ఐసిడిఎస్ ప్రాజెక్టులో జిల్లాలో ఏ ప్రాజెక్టులోనూ చేయని విధంగా పలు కార్యక్రమాలు చేసి పోషణ మాసోత్సవం కార్యక్రమానికి సార్థకత చేకూర్చారు. ఒకరోజు లక్కిడాం గ్రామంలోని అంగన్‌వాడీ కేంద్రంలో ఏర్పాటు చేసిన కార్యక్రమంలో సంస్థ



మేనేజర్ శ్యాంబాబు మాట్లాడుతూ అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా అందించే పౌష్టికాహారంలో పోషకాలు అధికంగా ఉంటాయని రక్తహీనత సమస్యలు నిర్మూలన జరుగుతాయన్నారు. అనంతరం గంట్యాడ ప్రాథమిక పాఠశాలలో చేతుల శుభ్రతపై అవగాహన కల్పించారు. మరోరోజు విజయనగరంలో 2కే రన్ కార్యక్రమం నిర్వహించారు. ఈ కార్యక్రమంలో జిల్లా కలెక్టర్ హరిజవహర్ లాల్ పాల్గొని ఆరోగ్య విజయనగర సాధనే లక్ష్యమన్నారు. పోషణ అభియాన్ కార్యక్రమాల్లో విజయనగరం జిల్లా రాష్ట్రంలోనే ప్రథమస్థానంలో ఉందన్నారు. ఇది ఇలాగే కొనసాగాలంటే సమిష్టిగా కార్యక్రమాలు చేపట్టాలన్నారు. తరువాత పౌష్టికాహారం ఇంటింటి వ్యవహారం అనే నినాదంతో గ్రామ, మండల జిల్లా స్థాయిలో ప్రచార రథం, కళాజాతా వంటి కార్యక్రమాలు నిర్వహించారు. పోషకాహార ప్రాముఖ్యతను తెలియచేసారు. పోషకాహార ప్రదర్శనలు సైతం ఏర్పాటు చేసి వాటి విశిష్టతను అందరికి అర్థమయ్యే రీతిలో అవగాహన కల్పించారు. పోషణ మంత్‌లోని పంచ సూత్రాలపై లోతైన అవగాహన కల్పించి వరల్డ్ విజన్ సంస్థ ఉన్నత అధికారుల మన్ననలను పొందింది. ఇప్పటికీ గంట్యాడ ప్రాజెక్టు ద్వారా గర్భిణీ బాలింతలకు అదనపు పోషకాహారాన్ని అందిస్తున్నారు. వైద్య ఆరోగ్యశాఖ, మహిళా శిశు సంక్షేమశాఖ సహకారంతో పలు ప్రయోజన కార్యక్రమాలు వరల్డ్ విజన్ ఇండియా చేస్తుంది.







# కడప జిల్లా

గర్భిణీలు బాలింతలకు తాము తీసుకునే ఆహారంపై పూర్తి స్పష్టత ఉండాలని, లేదంటే భవిష్యత్తులో అనారోగ్యకరమైన పరిస్థి తులు దాపురిస్తాయంటూ పోషణ మాసోత్సవ వేడుకలను కడప జిల్లాలో ప్రారంభించారు. ప్రాజెక్టు డైరెక్టర్ పద్మజ తమ జిల్లాలోని 13 రూరల్ ప్రాజెక్టులు, 2 అర్బన్ ప్రాజెక్టులలో పోషణ మాసోత్సవ వేడుకలు నెలరోజులపాటు గ్రామస్థాయిలో మండల, జిల్లా స్థాయిలో నిర్వహించి పోషణ ప్రాముఖ్యతను తెలియచేసారు. ఆరోగ్యకరమైన శరీర ఎదుగుదల కోసం పోషకాహారంతోపాటు ఐరన్ మాత్రలు కూడా వేసుకోవాలన్నారు. ఎనీమియాతో బాధపడే మహిళలకు ప్రసవం చాలా కష్టమవుతుందని కాబట్టి వైద్యులు సూచించిన మేరకు ఐరన్, పోలిక్ యాసిడ్ మాత్రలను వేసుకోవాలన్నారు. గర్భదారణ సమయంలో రెండు నెలలకు ఒకసారి ప్రసవానంతరం వారానికి ఒకసారి వైద్య పరీక్షలు చేయించుకోవాలన్నారు. పోషకాహార లోపంతో బాధపడే గర్భ వతులను, చిన్న పిల్లలను గుర్తించి వారికి పోషకాహారంతో పాటు అనుబంధ ఆహారం అందించాలన్నారు. గర్భిణీగా ఉన్న మొదటి వెయ్యి రోజులు అత్యంత కీలకమన్నారు. బిడ్డకు రెండేళ్ళ వచ్చే వరకు చాలా జాగ్రత్తలు పాటించాలన్నారు. కిశోరి బాలికలు, శరీరానికి శక్తినిచ్చే పౌష్టికాహారం భుజించాలని చెబుతూ బాల్య వివాహాలు వాటి వలన వచ్చే నష్టాలు, విద్య ప్రాధాన్యం రుతు క్రమం ఆ సమయంలో తీసుకోవాల్సిన జాగ్రత్తలు, లైంగిక దాడులు, మంచి, చెడూ స్పర్శ లాంటి విషయాలపై గ్రామాల్లో అవగాహన కల్పించారు. సిడిపిఒలు, సూపర్‌వైజర్లు అంగన్‌వాడీ కార్యకర్తలు, స్వచ్ఛంద సంస్థలు ఐసిడిఎస్‌కు అనుబంధంగా ఉన్న ఇతర ప్రభుత్వ శాఖ అధికారులు అందరూ కష్టపడి జిల్లాలో పోషకాహార ప్రాముఖ్యతను తెలియచేసారు. ఈ జిల్లాకి డైరెక్టర్ కృతికా శుక్లా ఆకస్మిక తనిఖీకి రావటం



విశేషం. కడప అర్బన్ ప్రాజెక్టు పరిధిలోని అలంకానపల్లి అంగన్‌వాడీ కేంద్రాన్ని తనిఖీ చేసారు. అక్కడ అంగన్‌వాడీ కేంద్రం ద్వారా జరుగుతున్న కార్యక్ర మాలను పర్యవేక్షించి పిల్లల ఎత్తు, బరువులు తూచారు. అక్కడకు వచ్చిన గర్భవతులు బాలింతలతో మాట్లాడి వారి ఆరోగ్య పరిస్థితు లను వారు తీసుకునే ఆహారం గూర్చిన వివరాలు స్వయంగా అడిగి తెలుసుకున్నారు. కడప అర్బన్ ప్రాజెక్టు నుండి కమలాపురం ప్రాజెక్టులోని నల్లలింగాయపల్లి అంగనవాడీ కేంద్రాన్ని తనిఖీ చేసారు. స్థానికంగా భారతి సిమ్మెంటు కంపెనీ సామాజిక కార్యక్రమాల్లో భాగంగా ఐసిడిఎస్‌కి ఇస్తున్న పోషకాహారాన్ని తనిఖీ చేసి వివరాలు అడిగి తెలుసుకున్నారు. వారు సరఫరా చేసే పోషకాహారాన్ని డైరెక్టర్ శుక్లా స్వయంగా రుచి చూసి సంతృప్తి వ్యక్తం చేసారు. అంగన్‌వాడీ కేంద్రానికి వచ్చిన చిన్నారులతో కాసేపు ముచ్చటించారు. పిల్లల ప్రాథమిక విద్య ఏవిధంగా జరుగుతుందో అంగన్‌వాడీ వర్కర్‌ని అడిగారు. అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా అందుతున్న సేవలు సక్రమంగా అందుతు న్నాయా లేనిది లబ్దిదారులను వివరాలు అడిగి తెలుసుకున్నారు. గర్భిణీ, బాలింతల యొక్క ఆరోగ్య స్థితిగతులు వారి ఆహారపు అలవాట్లు, పొందుతున్న వైద్యసేవలు గూర్చి వివరాలు స్వయంగా వారినే అడిగి తెలుసుకున్నారు.







అక్కడ నుండి నేరుగా పులివెందుల ప్రాజెక్టుకు వెళ్ళి వేపేంట క్రిస్టియన్ కాలనీలోగల అంగన్‌వాడీ కేంద్రానికి వెళ్ళారు. అక్కడ గర్భవతులకు సీమంతాలు నిర్వహించారు. అంగన్‌వాడీ కేంద్రాన్ని పరిశీలించి లబ్ధిదారులతో ముచ్చటించారు. అనంతరం వాలంటరీలతో సమా వేశం ఏర్పాటు చేసి అంగన్‌వాడీ సేవలు ఐసిడిఎస్ ముఖ్యఉద్దేశ్యం, రాబోయే రోజుల్లో మహిళా శిశు సంక్షేమ శాఖ ద్వారా జరిగే కార్యక్రమాలు వారికి అర్ధమయ్యే రీతిలో వివరించారు. డైరెక్టర్ వెంట ఎపిడి ఆదిలక్ష్మి, పులివెందుల సిడిపిఒలు శ్రీలత, శ్రీదేవి, అంగన్‌వాడీ పర్యవేక్షకులు, కార్య కర్తలు, వైద్య ఆరోగ్య సిబ్బంది తదితరులు ఉన్నారు.

## పశ్చిమగోదావరి జిల్లా

ఈ జిల్లా అంటే మొదటినుండి ఉన్నతాధికారులకు మంచి అభిప్రాయం ఉంటుంది. అన్ని కోణాల్లో ముందు వరుసలో ఉండే పశ్చిమ అంటే ప్రతి వారికి సదాభిప్రాయమే. ఈ జిల్లాలో ఎంతో కాలంగా శాశ్వత ప్రాతిపదికన ప్రాజెక్టు డైరెక్టర్ లేకపోయి నప్పటికి ఇన్‌ఛార్జి పిడి ఏలుబడిలో ఎక్కడా, ఎటువంటి ఇబ్బం దులు రాకుండా శాఖాపరంగా ప్రతి కార్యక్రమం అమలులో ఈ జిల్లా ముందు వరుసలో ఉండటం విశేషం. 18 ప్రాజెక్టులున్న పశ్చిమగోదావరి జిల్లాలో 2 ఏజెన్సీ ప్రాజెక్టులు ఉన్నాయి. ఈ శాఖ మంత్రి తానేటి వనిత ఈ జిల్లాకి చెందినవారు కావడం విశేషం. ఇక్కడ జిల్లా కలెక్టర్ ఆర్ ముత్యాలరాజు సైతం మహిళా శిశు సంక్షేమశాఖకి ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు. జిల్లా వ్యాప్తంగా 3,889 అంగన్‌వాడీ కేంద్రాలు ద్వారా పోషణ మాసోత్సవం సందర్భంగా ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహించారు. ఈ జిల్లాలో పూర్వ ప్రాథమిక విద్య అమలు కూడా ఎంతో ప్రతిష్టాత్మకంగా నిర్వహిస్తున్నారు. పోషణ అభియాన్‌లో భాగంగా పోషణ మాసో త్సవ వేడుక స్థానిక సిఆర్ఆర్ కళాశాలలో నిర్వహించారు. కార్య క్రమానికి ముఖ్యఅతిథిగా విచ్చేసిన మహిళా స్త్రీ, శిశు సంక్షేమ శాఖ మంత్రి తానేటి వనిత మాట్లాడుతూ ఆకాశంలో సగం,



అవనిలో సగం, అతనిలో సగమైన మహిళ ఆరోగ్యంలో కూడా సగం వాస్తవమా కాదా అని నవ్వుల మధ్య అన్నారు. విద్యతో పాటు ఆరోగ్యంపై కూడా ముఖ్యమంత్రి వైఎస్ జగన్మోహనరెడ్డి ప్రత్యేక దృష్టి పెట్టారని, అందుకోసం కోట్లాది రూపాయలు ఖర్చు చేస్తున్నారని చెప్పారు. గర్భిణీలు గర్భం దాల్చిన నాటి నుండి ఐరన్ మాత్రలు ఇతర పోషక విలువలుగల మందులు, ఆహారం తీసుకుని ఆరోగ్యవంతమైన బిడ్డలను దేశానికి అందిం చాలన్నారు. అప్పుడే దేశ అభివృద్ధి, రాష్ట్ర అభివృద్ధి, సమాజ అభివృద్ధితోపాటు కుటుంబ అభివృద్ధి కూడా సాధ్యమవుతుంద న్నారు. తక్కువ ఖర్చుతో ఎక్కువ పోషకాలుగల మునగ, తోటకూర, ఇతర ఆకుకూరలు, నువ్వులు, వేరుశనగ, బెల్లం వంటివి ఎక్కువగా తీసుకోవాలన్నారు. పుట్టిన బిడ్డకు తల్లిపాలు విలువ ఎంతో తల్లులకు తెలియజేయాలన్నారు. సకాలంలో అవసరమైన టీకాలు వేయించడంవల్ల పిల్లల్లో రోగనిరోధకశక్తి పెరిగి బిడ్డ ఆరోగ్యంగా ఉంటారని చెప్పారు. ఉపముఖ్యమంత్రి ఆళ్ళ కాళీకృష్ణ శ్రీనివాస్ (నాని) మాట్లాడుతూ తల్లి బిడ్డల సంర క్షణపై గతంలో ఎన్నడూ లేనివిధంగా ప్రత్యేక శ్రద్ధ తీసుకోవడం వల్ల మాతాశిశు మరణాలను గణనీయంగా తగ్గించగలిగామని చెప్పారు. స్త్రీ శిశు సంక్షేమ అధికారులు, అంగన్‌వాడీ కార్య కర్తలు, ఎఎన్ఎంలు, వైద్యాధికారులు, ఇతర సంస్థలు చిత్తశు











ద్దితో, స్ఫూర్తిదాయకంగా పనిచేస్తూ గర్భిణీలు, ప్రజల్లో ఆరోగ్యం పౌష్టికాహారం పట్ల విస్తృత ప్రచారం, అవగాహనా కార్యక్రమాలు నిర్వహించడంవల్ల ప్రజల్లో చైతన్యం కలిగిందన్నారు. ప్రతిఒక్కరూ ఆరోగ్యంపై తీసుకుంటున్న ప్రత్యేక శ్రద్ధ వల్ల మరణాల రేటు గతంలో కంటే తక్కువగా నమోదు అవుతున్నాయన్నారు. తల్లీ బిడ్డల ఆరోగ్యం, సంరక్షణపై తీసుకుంటున్న చర్యలు, అవగాహన కార్యక్రమాలు తనకు ఎంతో సంతోషాన్ని ఇస్తున్నాయని అందుకు అందరినీ అభినందించారు. పౌష్టికాహారం తీసుకోవడంతోపాటు వ్యాయామం, వ్యక్తిగత పరిశుభ్రత, పరిసరాల పరిశుభ్రతకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వాలన్నారు. గ్రామాలు, పేదవర్గాలు వుండే ప్రాంతాలలో ఇంటింటికీ వెళ్ళి రక్తహీనత రాకుండా ఏవిధంగా తక్కువ ఖర్చుతో ఎక్కువ పోషకవిలువలుగల ఆహారం తీసుకోవాలో అవగాహన కల్పించాలని నాని చెప్పారు. ఎంఎల్‌సి రాము సూర్యారావు, జాయింట్ కలెక్టర్-2 నంబూరి తేజ్‌భరత్, ఐసిడిఎస్ పిడి విజయకుమారి, మెప్మా పిడి పద్మావతి, అంగన్‌వాడీ కార్యకర్తలు, అధికారులు, మహిళలు పాల్గొన్నారు.

## ఏలూరు అర్బన్

శిశు మాతృత్వదశలో ప్రతి ఒక్కరికి ప్రత్యేక సంరక్షణ సహకారం అవసరమని గర్భిణీ, బాలింతలు ఆరోగ్య సంబంధిత విషయాల్లో, భుజించే ఆహారం విషయంలో ప్రత్యేక జాగ్రత్తలు తీసుకోవాలని సిడిపిఒ తులసి అన్నారు. సుపోషణ వేడుకల్లో భాగంగా ఏలూరు అర్బన్ ప్రాజెక్టు పరిధిలోని పలు డివిజన్లలో ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహించారు. అవగాహన ర్యాలీలు, పౌష్టికాహార ప్రదర్శనలు, కిశోరి బాలికలకు అవగాహన కార్యక్రమాలు పెద్దఎత్తున చేపట్టారు. 45వ డివిజన్ చోడిదిబ్బలో ఏర్పాటు చేసిన కార్యక్రమానికి తులసి ముఖ్య అతిథిగా హాజరై లబ్దిదారులతో మాట్లాడారు. గర్భిణీలు, బాలింతలు, చిన్నపిల్లలు తీసుకునే ఆహారంలో ఉండాల్సిన పోషక విలువల ఆవశ్యకతపై అవగాహన కల్పించారు. మానసిక, శారీరక ఎదుగదలకు పోషకాహారం ఎంతో ప్రాముఖ్యమైందన్నారు. పిండస్థ, శిశు మరణాల శాతాన్ని తగ్గించేందుకు గర్భం దాల్చిన వెంటనే మంచి పోషకాలు ఉన్న ఆహారం భుజించాలన్నారు. ఆహారం, పోషకాలకుతోడు, మరుగుదొడ్డి, వసతి, శుభ్రమైన త్రాగునీరు అందుబాటులో ఉండాలన్నారు. అలాగే పాండురంగపేట 2వ డివిజన్‌లో పోషకాహారంపై పాఠశాల విద్యార్ధులతో చైతన్య ర్యాలీ నిర్వహించారు. కార్యక్రమంలో సూపర్‌వైజర్ మేరి, కార్యకర్తలు, వైద్య ఆరోగ్య సిబ్బంది, ఆశావర్కర్లు పాల్గొన్నారు.

## బుట్టాయిగూడెం

పౌష్టికాహారం-ఇంటింటి ప్రాముఖ్యతను సూపర్‌వైజర్ విజయలక్ష్మి గర్భిణీలకు, బాలింతలకు అవగాహన కల్పించారు.







గిరిజన గ్రామాల్లో మహిళలు అవగాహనలేక సరైన పోషక విలువలున్న ఆహారం భుజించకపోవటం మూలంగా కాన్పు సమయంలో ఇబ్బందులు ఎదురవుతున్నాయన్నారు. గర్భం దాల్చిన దగ్గర నుండి బిడ్డకు 2 సంవత్సరాలు వచ్చేవరకు మధ్య ఉన్న కాలం వెయ్యిరోజులు అని ఈ వెయ్యి రోజులు ఎంతో జాగ్రత్తగా ఉండాలన్నారు. కె.ఆర్.పురం సెక్టారులో జరిగిన ఈ కార్యక్రమానికి లబ్దిదారులు, గ్రామస్తులు పెద్దఎత్తున హాజరైనారు. ఈ ప్రాజెక్టులో పనిచేసే సిబ్బంది ఎవరూ స్థానికంగా నివాస ముండకపోవటం వలన ఇక్కడ పోషణ మాసోత్సవ కార్యక్రమాలు మందకొడిగా సాగాయని గ్రామస్తులే చెప్పుకోవటం విశేషం.

## గోపాలపురం

గర్భిణీలు, బాలింతలు ఆరోగ్యంగా ఉండాలనే లక్ష్యంతో ప్రభుత్వం అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా పౌష్టికాహారం అంది స్తుంది. చిన్నారులకు విద్యాబోధనతోపాటు కోడిగుడ్లు, పాలు తదితర పౌష్టికాహారాన్ని అందిస్తున్నారని గర్భిణీలకు బాల సంజీవని పేరుతో ఎండుఖర్జూరం, వేరుశనగ అచ్చులు, రాగి పిండి, బెల్లం వంటి ఆహార పదార్థాలు ఉచితంగా సరఫరా చేస్తున్నారని వీటిని అందరూ సద్వినియోగం చేసుకోవాలని గోపాలపురం ప్రాజెక్టు దేవరపల్లి మండలం యాదవోలు సూపర్‌వైజర్ కృష్ణవేణి అన్నారు. పోషణ అభియాన్‌లో భాగంగా పోషణ వేడుకలకు సంబంధించి సుపోషణ దినోత్సవాన్ని నిర్వహించారు. ఈ సందర్భంగా హాజరైన గర్భిణీ బాలింతలకు ఆరోగ్య సూచనలు, సలహాలు అందజేసారు. తొలుత గ్రామంలో పోషకాహారం ఆవశ్యకతపై అవగాహన కల్గించారు. అనంతరం గర్భిణీలు గర్భం దాల్చిన దగ్గర నుండి వెయ్యి రోజులపాటు ఎలాంటి ఆహారం తీసుకోవాలి, ఆరోగ్య పరీక్షలు ఎప్పుడు చెయిం చాలి, పాలిచ్చే తల్లులు ఎలాంటి ఆహారం తింటే బిడ్డకు సంపూ ర్ణంగా పాలు ఇవ్వచ్చు అనే అంశాలపై లోతైన అవగాహన కల్గించారు. అలాగే కిశోరి బాలికలు, రుతు సమయంలో ఎలా





ఉండాలి ఆరోగ్య జాగ్రత్తలు ఎలాంటివి తీసుకోవాలో చెప్పారు. గ్రామాల్లోని స్త్రీలు పాల్గొని కార్యక్రమాన్ని విజయవంతం చేసారు. కార్యక్రమాలు కార్యకర్తలు, తల్లులు, గ్రామస్తులు నిర్వహించారు.

## గణపవరం ప్రాజెక్టు

ఆరోగ్యం మహాభాగ్యం అని నానుడి కానీ మహిళ ఆరోగ్యం బాగుంటే.. కుటుంబ ఆరోగ్యమంతా బాగుంటుంది. కుటుంబం బాగుంటే సమాజం బాగుంటుంది. సమాజం బాగుంటేనే... ప్రగతిశీలమవుతుంది కాబట్టి మహిళలు అందరూ ఆరోగ్యంగా, ఆనందంగా ఉండాలని తాడేపల్లిగూడెం శాసనసభ్యులు కొట్టు సత్యనారాయణ అన్నారు. గణపవరం ప్రాజెక్టులో పోషణ మాసో త్సవంను పురస్కరించుకుని పెంటపాడు సెక్టార్ పరిధిలో పలు కార్యక్రమాలు నిర్వహించారు. తల్లి బిడ్డ ఆరోగ్యంగా ఉండాలనే ఉద్దేశ్యంతో రాష్ట్ర ప్రభుత్వం అనేక పథకాలను అమలు చేస్తుంద న్నారు. స్త్రీ గర్భం దాల్చిన నాటినుండి పౌష్టికాహారాన్ని అందచేస్తు న్నామన్నారు. గర్భిణీలు, బాలింతలు క్రమం తప్పకుండా పౌష్టికా హారం తిసుకోవాలన్నారు. అనంతరం గర్భణీలకు సీమంతాలు నిర్వహించారు. వైద్య ఆరోగ్యశాఖ సిబ్బంది సమన్వయంతో ఐసిడి ఎస్ పలు కార్యక్రమాలు నిర్వహిస్తుందన్నారు. అలాగే ప్రభుత్వ ఆసుపత్రులలో పురుడు పోసుకున్నవారికి నగదు అందచేస్తుం దన్నారు. కార్యక్రమంలో ఎంపిడిఒ దామోదర్, తహశీల్దార్









సత్యవతి, సిడిపిఒ అమరావతి, పార్టీ నాయకులు, సూపర్‌వైజర్లు నయోమరాణి, బేబిసరోజిని, అంగన్‌వాడీ కార్యకర్తలు పాల్గొన్నారు. ఈ సందర్భంగా మండలంలోని పలు గ్రామాల్లో అవగాహన ర్యాలీలు నిర్వహించారు. అనంతరం ఇదే మండలంలోని వల్లూరుపల్లి గ్రామ పంచాయతీలో గర్భిణీలకు సామూహిక సీమంతాలు సూపర్‌వైజర్ నయోమిరాణి నిర్వహించారు. జాయ్ గుడ్‌ఫ్రెండ్స్ అసోసియేషన్ ఆధ్వర్యంలో నిర్వహించిన ఈ కార్యక్రమంలో మాజీ సర్పంచ్ మల్లిపూడి జాయిబాబు, ఆంజనేయులు మహిళలకు చీరలు అందజేసారు. ఈ సందర్భంగా గర్భిణ బాలింతలకు ఆరోగ్య విషయాలుపై అవగాహన కల్గించారు. కార్యక్రమంలో మాజీ ఎంపిటిసి పుష్పవతి, కుంచె సుబ్రహ్మణ్యం, వెంకట అప్పారావు, అంగన్‌వాడీ కార్యకర్తలు వెంకాయమ్మ, పద్మ, విఆర్ఒ కుమారి, ఆశ కార్యకర్తలు పాల్గొన్నారు.

## కొవ్వూరు

పౌష్టికాహారం వల్ల వచ్చే రక్తహీనత చాలా తీవ్రంగా ఉంటుందని మన శరీరానికి అవసరమైన సమతుల్య ఆహారం ఖచ్చితంగా భుజించాలని సూపర్‌వైజర్ కనకవల్లి అన్నారు. గర్భిణీ బాలింతల్లో రక్తహీనత ప్రజారోగ్య సమస్య అని దానిపై దృష్టి సారించాలన్నారు. పోషణ మాసోత్సవం సందర్భంగా కొవ్వూరు ప్రాజెక్టులో ఏర్పాటు చేసిన పోషణ మంత్ వేడుకల్లో భాగంగా గర్భిణీ, బాలింతలకు కనకవల్లి అవగాహన కల్పించారు. గర్భం దాల్చిన దగ్గర నుండి వెయ్యి రోజులపాటు తగిన జాగ్రత్తలు తీసుకుంటే తల్లిబిడ్డ కూడా ఆరోగ్యంగా ఉంటారని ఆమె చెప్పారు. అలాగే ఆడపిల్లలకు కౌమార దశ ముఖ్యమైనదని ఈ దశలో కౌమారులు శారీరక, మానసిక, సామాజిక మార్పులకు గురి అవుతారని ఈ సమయంలో బలవర్ధకమైన ఆహారం తినటం ఎంతో ముఖ్యం అన్నారు. రాష్ట్రవ్యాప్తంగా అమలవుతున్న ఐసిడిఎస్ కార్యక్రమాలు ద్వారా ఎంతోమందికి లబ్ది చేకూరుతుందని అంగన్‌వాడీ సేవలు అందరూ ఉపయోగించుకోవాలన్నారు. రక్తహీనత అనేది చాలా సమస్యగా ఉందని దానిని నివారించవలసిన బాధ్యత సమాజంపై కూడా ఉందన్నారు.

## పెదపాడు ప్రాజెక్టు

తల్లి కడుపులో నలుసుపడ్డప్పటినుంచి పుట్టిన తర్వాత రెండేళ్ళ వరకు అంటే తొలి వెయ్యి రోజుల్లో బిడ్డకు కావల్సిన పోషకాలు తగినంత లభించటం అత్యవసరం. అవి లోపిస్తే శరీరం మీదే కాకుండా మానసిక వికాసంపైనా విపరీత ప్రభావం పెరుగుతుంది కాబట్టి గర్భిణీగా ఉన్నప్పుడు సమతుల ఆహారం తీసుకోవటం చాలా ప్రాముఖ్యమని సిడిపిఒ వైబిటి సుందరి అన్నారు. పోషణ మాసోత్సవం సందర్భంగా ప్రాజెక్టు పరిధిలోని పలు సెక్టార్లలోనూ అంగన్‌వాడీ కేంద్రాల్లోను పలు కార్యక్రమాలు









నిర్వహించారు. ఈ సందర్భంగా సిడిపిఒ మాట్లాడుతూ గర్భిణీలు, బాలింతల్లో రక్తహీనతను తగ్గించేందుకు అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా పోషకాహారాన్ని అందిస్తున్నామని అర్హులైన ప్రతివారు సద్వినియోగం చేసుకుని క్రమం తప్పకుండా ఆహారం తీసుకోవాలన్నారు. పోషణస్థాయిని మెరుగుపరుచుకోవాలన్నారు. పోషకాహారంతోపాటు క్రమంతప్పకుండా ఆరోగ్య పరీక్షలు చేయించుకోవాలన్నారు. గర్భిణీ స్త్రీలకు ఐరన్ లోపం ఉంటే పుట్టబోయే బిడ్డ మెదడు కణాలు సరిగా వృద్ధి చెందవని కాబట్టి అందుబాటులో దొరికిన ఆహారాన్ని భుజించాలి అన్నారు. మన పెరట్లో పెరిగే ఆకుకూరలు, కాయగూరలు భుజంచటం వలన ఆరోగ్యంగా ఉండొచ్చు అన్నారు. అలాగే కౌమార బాలికలు సరైన ఆహారం తీసుకోకపోతే రక్తహీనత ఏర్పడతుందని, ఈ వయస్సులో రక్తహీనత ఏర్పడితే జీవితకాలం బాధపడాల్సి వస్తుందన్నారు. ప్రాజెక్టు పరిధిలో రాట్నాలకుంట, రాయనపాడు, వట్లూరు, పెదకడిమి, పెదపాడు గ్రామాల్లో వేడుకగా ఈ కార్యక్రమాలు నిర్వహించారు. కార్యక్రమాల్లో ఎసిడిపిఒ సునీల్ రాజశేఖర్, పర్యవేక్షకులు, అంగన్‌వాడీ కార్యకర్తలు పాల్గొన్నారు.

## నల్లజర్ల ప్రాజెక్టు

ప్రాజెక్టు పరిధిలోని దూబచర్ల సెక్టారులో పర్యవేక్షకురాలు సరోజిని ఆధ్వర్యంలో సుపోషణ వేడుక నిర్వహించారు. ఈ సందర్భంగా ఆమె మాట్లాడుతూ శక్తినిపెంచే ఆకుకూరలు, కాయ గూరలుపై అవగాహన పెంపొందించారు. గర్భిణీలు ముఖ్యంగా బలవర్ధకమైన ఆహారాన్ని భుజించి ఆరోగ్యంగా ఉంటే అనారోగ్యం దరిచేరదన్నారు. పోషణ వేడుక ప్రాముఖ్యతను అందరికి అర్ధమయ్యే రీతిలో వివరించారు. అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా చిన్నారులకు అందచేసే బాలామృతంలో ఎన్నో విటమిన్లు ఉన్నాయని పిల్లలు తినేలా తల్లిదండ్రులు ప్రోత్సహించాలన్నారు. కౌమార బాలికలు వ్యక్తిగత ఆరోగ్య విషయాల్లో శ్రద్ధవహించాల న్నారు. కార్యక్రమంలో కార్యకర్తలు, గ్రామస్థులు పాల్గొన్నారు.



# రక్తహీనత నివారణకు అంగన్‌వాడీలు కృషి చేయాలి

**- ఎంపి చంద్రశేఖర్**

జిల్లాలో రక్తహీనత నివారణకు క్షేత్రస్థాయిలో మరింత కష్టపడి అంగన్‌వాడీలు పనిచేయాలని పార్లమెంటు సభ్యులు బెల్లాన చంద్రశేఖర్ అన్నారు. విజయనగరం జిల్లా చీపురుపల్లి ఐసిడిఎస్ ప్రాజెక్టులో జరిగిన పోషణ మాసోత్సవ కార్యక్రమానికి ముఖ్య అతిధిగా హాజరైన ఎంపి మాట్లాడుతూ ప్రభుత్వం మాతా శిశు సంరక్షణ కోసం కోట్లాది రూపాయలు ఖర్చు చేస్తోందని, మహిళల్లో ముఖ్యంగా గర్భిణీల్లో రక్తహీనత తగ్గించేందుకు మరింత కష్టపడి అంగన్‌వాడీ సిబ్బంది పనిచేయాలని సూచిం చారు. అలాగే చంటిపిల్లలు ఆహార విషయంలో కూడా శ్రద్ధ వహించి సమతుల్య ఆహారం అందించాలని కోరారు. అనంతరం ప్రాజెక్టులో ఏర్పాటు చేసిన పౌష్టికాహార ప్రదర్శన, గర్భిణీలకు సీమంతాలు తదితర కార్యక్రమాల్లో పాల్గొన్నారు. ప్రాజెక్టు డైరెక్టర్ రాజేశ్వరి మాట్లాడుతూ పోషణ్ అభియాన్‌లో భాగంగా పోషణ మాసోత్సవ వేడుకలను ఈ నెల రోజుల పాటు ప్రాజెక్టు అంతా నిర్వహించామని, గ్రామస్థాయిలో గర్భిణీలకు, బాలింతలకు పూర్తిస్థాయి అవగాహన కల్పించామన్నారు. కార్యక్రమంలో సిడిపివో, సిబ్బంది తదితరులు పాల్గొన్నారు.





# అక్రమాలకు పాల్పడితే ఉపేక్షించేది లేదు

## పశ్చిమగోదావరి జిల్లా సిడిపిఒలకు కలెక్టర్ ముత్యాలరాజు హెచ్చరిక



అంగన్‌వాడీ సెంటర్‌లో పిల్లలకు ఒక కోడిగ్రుడ్డు పెట్టాల్సి వుండగా అరగ్రుడ్డు మాత్రమే పెట్టి పిల్లల నోటిదగ్గర కూడు కూడా తినేయడం మామూలు పాపంకాదని, మహాపాపమని జిల్లా కలెక్టర్ రేవు ముత్యాలరాజు ఆవేదన వ్యక్తం చేశారు. ఇటీవల స్థానిక కలెక్టర్ కార్యాలయంలోని ఐసిడిఎస్ పరిధిలో అమలవుతున్న పథకాలు, అంగన్‌వాడీ కేంద్రాల పనితీరు తదితర అంశాలపై అధికారులతో కలెక్టర్ ముత్యాలరాజు సమీక్షించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ గత రెండు నెలలుగా జిల్లాలోని అంగన్‌వాడీ కేంద్రాలను ప్రత్యేక అధికారులు తనిఖీలు చేసి నివేదికలు ఇచ్చారని, ఆ నివేదికలు చూస్తే అంగన్‌వాడీ కేంద్రాలు ఏవిధంగా పనిచేస్తున్నాయో, చిన్నారులకు, గర్భిణీలకు అందిస్తున్న ఆహారం ఎంత లోపభూయిష్టంగా వున్నదో అర్థమవుతోందని అన్నారు. అంతేగాక చాలా అంగన్‌వాడీ కేంద్రాలలో కనీస సౌకర్యాలు లేకపోవడం గుర్తించారన్నారు. ప్రత్యేక అధికారులు తనిఖీలుచేస్తే తప్ప అంగన్‌వాడీ కేంద్రాలలో వున్న లోపాలు సిపిడిపిఓలు, అంగన్‌వాడీ సూపర్‌వైజర్‌లు గుర్తించలేక పోతున్నారా? అని ప్రశ్నించారు. అంగన్‌వాడీ కేంద్రాలలో నూరు శాతం మౌలిక సదుపాయాలు వున్నాయని నివేదికలు ఇస్తున్నారని వాస్తవానికి అటువంటి పరిస్థితి లేదన్నారు. ఐసిడీఎస్ పనితీరు తనకు అసంతృప్తి కలిగించిందని ఆవేదన వ్యక్తం చేశారు. నల్లజర్ల మండలంలోని 4వ నెంబరు అంగన్‌వాడీ కేంద్రంలో పిల్లలకు కోడిగ్రుడ్డులో సగం మాత్రమే పెట్టడం ప్రత్యేక అధికారులు గుర్తించడం చూస్తే చాలా బాధవేస్తోందని డబ్బు ఉన్నవారు ఎవరూ అంగన్‌వాడీ కేంద్రాలకు రారని, కేవలం పేదపిల్లలు మాత్రమే వస్తారని అటువంటి పేదపిల్లలకు అందించే కోడి గ్రుడ్లను కూడా తినేయడం మామూలు పాపం కాదని అన్నారు. పిల్లల, గర్భిణీల కోసం అంగన్‌వాడీ సెంటర్లుకాని, మీకోసం అంగన్‌వాడీ సెంటర్లు కాదని గుర్తించాలన్నారు. ఇకపై విధుల్లో నిర్లక్ష్యం వహించేవారిని, అక్రమాలకు పాల్పడే వారిని ఉపేక్షించేది లేదని హెచ్చరించారు. సక్రమంగా పనిచేయడం నేర్చుకోండని సూచించారు. వెంటపడి పనిచేయించాలని ఐసిడీఎస్ పీడీ విజయకుమారిని ఆదేశించారు. కొన్ని అంగన్‌వాడీ కేంద్రాలలో టాయిలెట్ సౌకర్యం లేకపోవడం, తక్కువ మంది పిల్లలు వస్తుండగా హాజరు ఎక్కువ చూపించడం, 10 అంగన్‌వాడీలకు కొత్తభవనాలు నిర్మాణం పూర్తయినా ఇంకా ప్రారంభోత్సవాలు చేయకపోవడం,విద్యుత్ లేక లైట్లు, ఫ్యానులు లేకపోవడం వంటి అంశాలను ప్రత్యేక అధికారులు గుర్తించి నివేదికలు ఇచ్చారని చెప్పారు. మూడు నెలలకు ప్రత్యేక అధికారులు తనిఖీలకు వస్తారని ఆ సమయానికి సమస్యలన్నీ పరిష్కారమైవుండాలన్నారు. వచ్చే నెల అక్టోబర్ 7వ తేదీ నుండి జిల్లాలోని ఇంటింటికి వెళ్ళి పక్కాగా సర్వే నిర్వహించాలన్నారు. ఇంటిలో ఎవరెవరు ఉంటున్నారు. పిల్లలు ఎంతమంది, గర్భిణీలు వున్నారా? తదితర వివరాలను సేకరించాలన్నారు. సీడీపీఓలకు, సూపర్‌వైజర్లకు అవసరమైన స్టాండర్డ్ మెటీరియల్ అందచేయాలన్నారు. జిల్లాలో అంగన్‌వాడీ టీచర్లు, ఆయాల పోస్టులు ఖాళీగా వుండటానికి వీల్లేదని, ఏనెలకానెల ఖాళీలను నిబంధనల ప్రకారం పూర్తి చేయాలని ఆదేశించారు. ప్రతి అంగన్‌వాడీ కేంద్రానికి ఎంత మంది పిల్లలు వస్తున్నారో ప్రతిరోజు ఉదయం 9 గంటల నుండి 9.30లోగా ఫొటోతో సహా హాజరు వివరాలు అందించాలని ఆదేశించారు. అంగన్‌వాడీ కేంద్రాల నుండి ప్రతిరోజు ఉదయం 9.30లోగా హాజరు నివేదిక రావడం, పిల్లల హాజరుశాతం, అంగన్‌వాడీలలో మౌలిక సౌకర్యాల కల్పనపై రేటింగ్ ఇవ్వడం జరుగుతుందని కలెక్టర్ ముత్యాలరాజు చెప్పారు. ఈ సమావేశంలో ఐసిడీఎస్ పీడీ విజయకుమారి, సీడీపీవోలు పాల్గొన్నారు.



# అంగన్‌వాడీలను ప్రభుత్వ ఉద్యోగులుగా గుర్తించాలి

## ఐసిడిఎస్‌ను బలోపేతం చేయాలి

## ఉత్సవపూరిత వాతావరణంలో జరిగిన అంగన్‌వాడీ రాష్ట్ర మహాసభలు





పోషకాహార లోపాలను, శిశు మరణాలను తగ్గించడంలోనూ పిల్లల అభివృద్ధిలో అత్యంత కీలకపాత్ర పోషిస్తున్న అంగన్‌వాడీ కేంద్రాలను బలోపేతం చేయాల్సిన పాలకులు వాటిని బలహీన పరిచే ప్రయత్నాలు ముమ్మరం చేస్తున్నారని ఇప్పటికైనా అంగన్ వాడీలను ప్రభుత్వ ఉద్యోగులుగా గుర్తించాలని అఖిల భారత అంగన్‌వాడీ వర్కర్స్, హెల్పర్స్ యూనియన్ ప్రధాన కార్యదర్శి ఎఆర్ సింధు డిమాండ్ చేసారు. గుంటూరు జిల్లా సత్తెనపల్లి పట్టణంలోని కాకతీయ కళ్యాణమండపంలో ఏపీ అంగన్‌వాడీ వర్కర్స్ హెల్పర్స్ 9వ రాష్ట్ర మహాసభలు రెండు రోజులపాటు నిర్వహించారు. ప్రారంభ కార్యక్రమంలో సింధు మాట్లాడుతూ మాతా శిశు సంరక్షణకు చిత్తశుద్ధితో కృషి చేస్తున్న అంగన్‌వాడీ లకు ఫించనుతో కూడిన పదవీవిరమణ కల్పించేలా చూడాల్సిన బాధ్యత ప్రభుత్వాలపై ఉందన్నారు. కనీస వేతనంగా నెలకు 18 వేలు ఇవ్వాలన్నారు. కార్మిక చట్టాలను కాలరాయాలని కేంద్ర ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నాలను పోరాటాలతో అడ్డుకుం టామన్నారు. గ్రామీణ మారుమూల ప్రాంతాల్లో పసిపిల్లల అభివృద్ధికి నిరంతరం పాటు పడుతున్నామని అయినా సరిపడి నంత వేతనాలు లభించటం లేదని, ఉద్యోగ భద్రత కూడా కరువైపోయిందన్నారు. ప్రభుత్వ ఉద్యోగులుగా గుర్తింపు పొంద టానికి వివిధ రూపాల్లో ఎన్నో ఏళ్ళుగా పోరాటాలు చేస్తున్నా ప్రభుత్వంలో చలనం లేదన్నారు. శాసనమండలి సభ్యులు లక్ష్మణ రావు మాట్లాడుతూ వచ్చే ఏడాదికి దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించి 75 ఏళ్ళు కావస్తున్నప్పటికి 60 శాతంమంది మహిళలు 40 శాతం చిన్నారులు రక్తహీనతతో బాధపడుతున్నారన్నారు. నూతన జాతీయ విద్యావిధానంలో కస్తూరి రంగన్ నివేదికను బట్టి అంగన్‌వాడీ వ్యవస్థ కాలగర్భంలో కలిసిపోయే ప్రమాదం ఉందన్నారు. కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా హాజరైన నరసరావు పేట పార్లమెంటు సభ్యులు లావు శ్రీకృష్ణదేవరాయులు మాట్లా డుతూ అంగన్‌వాడీల అభ్యున్నతికి ప్రభుత్వం కృషి చేస్తుంద న్నారు. అంగన్‌వాడీ కార్యకర్తలకు నైపుణ్యం పెంపొందించేందుకు దేశవ్యాప్తంగా 3.500 టీచరు ట్రైనింగ్ సెంటర్లు ఏర్పాటు చేయ బోతున్నారని తెలిపారు. అంగన్‌వాడీల వేతనాల పెంపుదలకు కృషి చేస్తున్నామన్నారు. అంగన్‌వాడీలతోపాటు అర్హులైన పేదలం దరికి ముఖ్యమంత్రి వైఎస్ జగన్మోహనరెడ్డి ఇళ్ళ స్థలాలు, పక్కా గృహాలు నిర్మించనున్నారని ఎంపి తెలిపారు. సత్తెనపల్లి శాసన సభ్యులు అంబటి రాంబాబు మాట్లాడుతూ అంగన్‌వాడీల సమ స్యల పరిష్కారానికి సిఎం జగన్మోహనరెడ్డి సంబంధిత మంత్రి దృష్టికి తీసుకువెళ్తానన్నారు. ప్రపంచంలోనే అతిపెద్ద పోషకాహార సంస్థను విస్తరింప చేసే దిశలో ప్రభుత్వం ఉందన్నారు. తెదేపా హయాంలో అంగన్‌వాడీలపై రాజకీయ వేధింపులు ఉండేవని, ఈ విషయాన్ని ప్రతిపక్షంలో ఉన్న సందర్భంలో తాను అనేకసార్లు లేవనెత్తానని తమ ప్రభుత్వంలో ఇలాంటి వేధింపులే ఉండవన్నారు. ఐద్వా రాష్ట్ర ప్రధాన కార్యదర్శి రమాదేవి మాట్లా డుతూ హరించుకుపోతున్న మహిళా హక్కుల్ని ఉద్యమాల ద్వారా సాధించుకోవాలన్నారు. సమాన పనికి సమాన వేతనం ఆత్మగౌర వంతో జీవించేందుకు అవసరమైన పరిస్థితులు కోసం ఉద్యమిం చాలన్నారు. అనంతరం కేంద్రం కార్మిక చట్టాల సవరణను ఉపసంహరించుకోవాలని అంగన్‌వాడీ కేంద్రాలను ప్రైవేటుసంస్థ



లకు అప్పగించరాదనే తీర్మానాన్ని రాష్ట్ర ప్రధాన కార్యదర్శి సుబ్బరావమ్మ ప్రవేశపెట్టారు. అంగన్‌వాడీలకు అదనపు పనిభారం తగ్గించాలని, రాజకీయ వేధింపులు ఆపాలనే తీర్మానాన్ని రాష్ట్ర ఉపాధ్యక్షురాలు సుప్రజ ప్రవేశపెట్టగా మహాసభ ఏకగ్రీవంగా ఆమోదించింది. గత మహాసభ నుండి ఇప్పటివరకు మరణించిన వారికి సంతాపం తెలుపుతూ తీర్మానాన్ని రాష్ట్రఅధ్యక్షులు బేబిరాణి ప్రవేశపెట్టారు. క్యూబా విప్లవ నేత అమెరికన్ సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా పోరాడిన ఫెడ్రల్ కాస్ట్రో లాటిన్, అమెరికా దేశాల్లో వామపక్షవాది మార్తుహర్నేకర్, ప్రముఖ శాస్త్రవేత్త స్టీఫెన్ హాకింగ్స్‌కు మహాసభ సంతాపం ప్రకటించింది. మహాసభ సందర్భంగా ఉద్యమవీరులకు అంగన్‌వాడీ యూనియన్ నాయకులు విప్లవ జోహార్లు అర్పించారు. యూనియన్ ఆల్ ఇండియా కమిటీ మహాసభల సందర్భంగా రాష్ట్రవ్యాప్తంగా 13 జిల్లాల నుండి అంగన్‌వాడీలు ప్రతినిధులు భారీగా తరలివచ్చారు. తొలుత యూనియన్ జెండాను సంఘం రాష్ట్ర గౌరవాధ్యక్షులు పి. రోజా ఆవిష్కరించారు. ఈ సందర్భంగా అతిథులను ఘనంగా సత్కరించారు.

# 11 సెకన్లకో మరణం

కొన్ని దశాబ్దాలుగా ప్రసవ మరణాలు గణనీయంగా తగ్గుముఖం పట్టాయి. కానీ...ఆ గుండె కోత మాత్రం పూర్తిగా దూరం కాలేదు. నేటికీ ప్రపంచవ్యాప్తంగా 11 సెకన్లకో గర్భిణీ, బాలింత లేదా బిడ్డ తనువు చాలిస్తూనే ఉన్నారు. ప్రపంచ ఆరోగ్య సంస్థ (డబ్ల్యూహెచ్‌వో), ఐరాస బాలల నిధి సంస్థ(యునిసెఫ్) తదితర సంస్థలు ఈ వివరాలతో కూడిన రెండు తాజా నివేదికలను విడుదల చేశారు.

**తగ్గుదలకు కారణాలివి**

- ✦ ప్రసవ సమయంలో నిపుణులైన వైద్యులు, సహాయకులు అందుబాటులో ఉండటం. పరిశుభ్రమైన తాగునీరు, పోషకాహారం, వైద్యం టీకాలు సకాలంలో అందుతుండటం.
- ✦ ప్రపంచవ్యాప్తంగా ఐదేళ్లలోపు చిన్నారుల మరణాలు సగం మేర తగ్గాయి. నిరుడు ఈ వయసు పిల్లలు 53,00,000 మంది చనిపోయారు. ఇలా కాలం చేస్తున్నవారిలో ఏటా 7,000 మంది పురుటి బిడ్డలూ ఉంటున్నారు.
- ✦ పరిష్కరించదగ్గ సమస్యలతో ఏటా చనిపోతున్న బాలింతలు, పురుటి బిడ్డల సంఖ్య 28,00,000
- ✦ ప్రసవ సమయ సంక్లిష్టతల కారణంగా 2000లో చనిపోయిన బాలింతల సంఖ్య 4,51,000
- ✦ 2017లో ఇలాంటి మరణాల సంఖ్య 2,95,000
- ✦ అధికాదాయ దేశాల్లో సంభవిస్తున్న ప్రసవ మరణాలతో పోల్చితే ఆఫ్రికాలో ఇలాంటి మరణాలు 50 రెట్లు అధికం.
- ✦ 2030 ప్రపంచ సుస్థిరాభివృద్ధి లక్ష్యం ప్రతి లక్ష ప్రసవాల్లో సంభవించే మరణాలను గరిష్టంగా 70కి పరిమితం చేయడం.

# తుని ఎంఎల్ఏ రాజా వితరణ





గర్భిణీలు పౌష్టికాహారం భుజించడంతో పాటు ఆరోగ్య విషయాల్లో కూడా శ్రద్ధ వహించాలని, అప్పుడే పుట్టబోయే బిడ్డ ఆనందంగా, ఆరోగ్యంగా జన్మిస్తాడని తుని ఎమ్మెల్యే దాడిశెట్టి రాజా అన్నారు. ఇటీవల తుని అర్బన్ ప్రాజెక్టు పరిధిలో పోషణ మాసోత్సవ వేడుకలు స్థానిక శ్రీశక్తిభవన్‌లో వేడుకగా నిర్వహించారు. ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా విచ్చేసిన రాజా మాట్లాడుతూ మహిళ గర్భం దాల్చిన నాటి నుండి సమతుల్య ఆహారం భుజించడంతోపాటు ఆరోగ్య విషయంలో కూడా ప్రత్యేక శ్రద్ధ వహించి ఎప్పటికప్పుడు వైద్యపరీక్షలు చేయించుకోవాలని హితవు పలికారు. అనంతరం హాజరైన గర్భిణీలు అందరికీ ఆయనే దగ్గరుండి సీమంతాలు నిర్వహించి ప్రతీ గర్భిణీకి వైద్య ఖర్చుల నిమిత్తం రూ. 4 వేలు ఆర్థిక సహాయం అందజేశారు. కార్యక్రమంలో సిడిపివో నాగలక్ష్మి, సూపర్‌వైజర్ నిహారిక, అనుబంధ శాఖల అధికారులు పాల్గొన్నారు.



# ఆడపిల్లల భద్రత మనందరి బాధ్యత

## రాష్ట్రంలో మహిళల భద్రతపై కొత్త ఆలోచనలకు శ్రీకారం

## ఏపీ మహిళా కమీషన్ ఛైర్‌పర్సన్ వాసిరెడ్డి పద్మ

నాగరిక సమాజంలో ఉంటున్నామని, ఆధునిక కాలంలో జీవిస్తున్నామని పొంగిపోవటం సహజమే కానీ మనం ఆటవీకులు కన్నా అధ్వాన్నంగా ఉన్నామని సమాజంలో ఆడపిల్ల స్థాయిని చూస్తే తెలుస్తుంది. ఒక దేశ ప్రగతికి స్త్రీ అభివృద్ధే కొలమానం. ఆవిధంగా చూస్తే మనం నడుస్తున్నది పురోగమనం వైపా! ఎటువైపు వెళ్తున్నామో అర్థం కాని స్థితి. ఆడబిడ్డ కడుపులో ఉంది అని తెలియగానే ఆందోళన. బిడ్డ కన్ను తెరిస్తే భయం. బాలికగా, యువతిగా, వివాహితగా, గృహిణిగా, ఉద్యోగినిగా ఏ స్థాయిలో ఉన్నా ఏ దశలో ఎదుగుతున్నా ఆమెకు సమస్యలే సమస్యలు. పుణ్యభూమిగా వాసికెక్కిన ధర్మభూమిగా పేరు పొందిన సంస్కృతి సంప్రదాయాలకు విలువనిచ్చే భారతదేశంలో స్త్రీ స్థాయి ఇంత ఘోరంగా ఉందా? స్త్రీ ఎదుగుదలకి ఎన్నెన్నో అవరోధాలు ఎన్నెన్నో ఆటంకాలు భారతదేశంలో లైంగిక వేధింపుల సమస్య తీవ్ర స్థాయిలో ఉంది. స్త్రీలు, యువతిలే కాదు బాలికలు సైతం బలి అవుతున్నారు. లైంగిక వేధింపులు కుటుంబం మొదలుకొని బహిరంగ ప్రదేశాలు వరకు వ్యాపించాయి. లైంగిక వేధింపులకు వావివరుసలు లేవు. వయోబేదాలు కానరావు. పసిపాప మొదలు ముది ముసలి వరకు తేడా లేకుండా కసాయిలా వ్యవహరిస్తున్నారు. చాలమంది కామాందులు ఒంటరిగా అమ్మాయి కనిపిస్తే మగాడిలోని రాక్షసుడు నిద్రలేస్తాడు. దారికాచి అఘాయిత్యానికి పాలుపడతాడు. కళాశాలలు, విద్యాసంస్థలే కాదు రైళ్ళు, బస్సులు రద్దీగా ఉండే ప్రదేశం ఏదైనా అవకాశం దొరికితే అతివల శరీరాన్ని తడిమి పైశాచిక ఆనందాన్ని పొందుతాడు. బాగా చదువుకున్నవారు, మంచి హోదాలో ఉన్న వారు ఇలాంటి దారుణాలకు ఒడిగడుతున్నారు. మేకవన్నె పులులు బారిన పడకుండా అమ్మాయిలు ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి, ఎవరికి ఫిర్యాదు చేయాలి, సామాజిక మాధ్యమాలు మహిళలుపై ఎలాంటి ప్రభావం చూపుతున్నాయి తదితర విషయాలపై అవగాహన కల్గించటానికే ఆంధ్రప్రదేశ్ మహిళా కమీషన్ ఛైర్‌పర్సన్ వాసిరెడ్డి పద్మ పట్టుదలతో ప్రతి జిల్లాలో ఈ కార్యక్రమాలు అమలు చేస్తున్నారు. దానిలో భాగంగా తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రి, కాకినాడలో జరిగిన సామాజిక మాధ్యమాలు, మహిళల భద్రతపై సదస్సులపై ప్రత్యేక కథనం...





నేటి హైటెక్ యుగంలో సోషల్ మీడియా ప్రభావం సమాజం పైనా ముఖ్యంగా విద్యార్థినీ విద్యార్థులపై తీవ్ర ప్రభావం చూపు తుందని, దీనివలన ఎంత అయితే మంచి ఉందో అదే స్థాయిలో చెడు కూడా ఉందని సోషల్ మీడియా గూర్చి ఎపి మహిళా కమిషన్ ఛైర్‌పర్సన్ వాసిరెడ్డి పద్మ అన్నారు. మహిళలు, యువతుల పట్ల జరుగుతున్న హింసను అందరూ తీవ్రంగా వ్యతిరేకించాలన్నారు. సెప్టెంబర్ 12వ తేదీ గురువారం రాజమండ్రిలోని స్థానిక శ్రీ వేంకటేశ్వర ఆనం కళా కేంద్రంలో 'సామాజిక మాధ్యమాలు – మహిళలు' అనే అంశంపై చర్చాగోష్టి జరిగింది. ఈ సందర్భంగా వాసిరెడ్డి పద్మ మాట్లాడుతూ సామా జిక మాధ్యమాలు వలన ఉపయోగాలు ఎక్కువ ఉన్నాయని దీనికి నిదర్శనంగా నిర్భయ కేసును ఉదహరించారు. సామాజిక మాధ్యమాలను దుర్వినియోగం చేయకుండా సద్వినియోగపర్చు కోవాలన్నారు. మహిళలపై అత్యాచారాలు, వేధింపుల విష యంలో ఇప్పటికే ఆన్‌లైన్ ద్వారా దరఖాస్తులు తీసుకుంటున్నా మని రాబోయే రోజుల్లో హెల్ప్‌లైన్ ఏర్పాటు చేస్తామన్నారు. మహిళలపై అత్యాచారాలు నివారించాలంటే ముందుగా మనిషి ఆలోచన విధానం మారాలన్నారు. విద్యాసంస్థల్లో అన్ని వర్గాల వారికి అవగాహన కార్యక్రమాలు నిర్వహిస్తామన్నారు. రాష్ట్ర ముఖ్యమంత్రి వైఎస్ జగన్మోహనరెడ్డి మహిళలకు పెద్దపీట వేస్తూ నామినేటెడ్ పదవుల్లో 50శాతం పదవులు ఇచ్చారన్నారు. రాజ మహేంద్రవరం ఎంపి మార్గాని భరత్‌రామ్ మాట్లాడుతూ మహిళ లపై వేధింపుల విషయంలో 90శాతం కేసులు బయటకు రాకుండా ఉంటున్నాయన్నారు. జరుగుతున్న అన్యాయంపై మహిళ నిర్భయంగా పోలీసులను ఆశ్రయించాలన్నారు. ఎమ్మెల్సీ సోము వీర్రాజు మాట్లాడుతూ మహిళలను గౌరవించుకునే సాంప్రదాయం మన దేశంలో ఉందన్నారు. ఎంఎల్ఏ ఆదిరెడ్డి భవాని మాట్లాడుతూ సమాజంలో 90 శాతం మంది మహిళలు ఏదో ఒక విషయంలో సమస్యలు ఎదుర్కొంటున్నారన్నారు. తరువాత రోజు కాకినాడ జెఎన్టీయులోని అటామ్నీ ఆడిటోరి యంలో ఇదే కార్యక్రమం నిర్వహించారు. ఈ కార్యక్రమంలో హోంమంత్రి సుచరిత, మహిళా శిశు సంక్షేమశాఖ మంత్రి తానేటి వనిత, ఎంపిలు, ఎంఎల్ఏలు పాల్గొని మహిళలు, బాలి కలు రోజువారీ ఎదుర్కొంటున్న సైబర్ నేరాలపై విద్యార్థులకు అవగాహన కల్పించారు. మహిళా కమిషన్ ద్వారా ఏర్పాటు చేసిన ఈ కార్యక్రమం అందరిని ఆకట్టుకుని ఆలోచింపచేసింది. భవిష్యత్తులో మహిళా కమిషన్ ద్వారా మరిన్ని మంచి కార్యక్ర మాలు జరగాలని హాజరైన అతిథులు కోరుతున్నారు.



# జిల్లాలో పోషకాహారలోపం తగ్గించాలి

## పోషణ అభియాన్ 2కే రన్‌లో నెల్లూరు జిల్లా కలెక్టర్ శేషగిరిబాబు






గర్భస్థ శిశువు నుంచి 18ఏళ్ల బాల బాలికల వరకు పోషకాహార లోపాన్ని సవరించేందుకు ప్రభుత్వం పోషణ అభియాన్ కార్యక్రమాన్ని చేపట్టిందని, జిల్లాలో ఈ కార్యక్రమాన్ని విజయవంతం చేసేందుకు అందరూ కృషి చేయాలని జిల్లా కలెక్టర్ ఎంవీ శేషగిరిబాబు కోరారు. పోషణ మాసోత్సవంలో భాగంగా ఐసీడీఎస్ ఆధ్వర్యంలో నగరంలోని సర్వోదయ కళాశాల నుంచి గాంధీబొమ్మ వరకు 2కే రన్ కార్యక్రమాన్ని నిర్వహించారు. కార్యక్రమాన్ని కలెక్టర్ జెండా ఊపి ప్రారంభించారు. కలెక్టర్, ఇతర అధికారులు, నర్సింగ్ విద్యార్థులు, ఐసీడీఎస్ ఉద్యోగులు, సిబ్బంది ఈ పరుగులో పాల్గొన్నారు. అనంతరం కలెక్టర్ మాట్లాడుతూ జిల్లాలో పోషకాహార లోపంతో బాధపడుతున్న వారి సంఖ్య క్రమంగా పెరుగుతోందన్నారు. శిశుమరణాల రేటు పెరిగేందుకు ఇదొక కారణమవు తుందన్నారు. అనంతరం 2కే రన్ విజేతలు విజయ్, ఝాన్సీ, కరుణశ్రీలకు తెలుగుగంగ ప్రాజెక్టు ప్రత్యేక కలెక్టర్, ఐసీడీఎస్ ఇన్‌ఛార్జి పీడీ సదా భార్గవి జ్ఞాపికలు అందజేశారు. ఐసీడీఎస్ అదనపు పీడీ శేషకుమారి, సెట్‌వెల్ సీఈవో కనకదుర్గాభవాని, సమాచార పౌరసంబంధాల శాఖ డీడీ వెంకటేశ్వరప్రసాద్, ముఖ్య కోచ్ యతిరాజు, సీడీపీవోలు, అంగన్‌వాడీ కార్యకర్తలు, డీకేడబ్ల్యు కళాశాల విద్యార్థినులు, క్రీడాకారులు, టాటా ట్రస్ట్ ప్రతినిధులు పాల్గొన్నారు.

## చందాదారులకు ముఖ్య గమనిక

"స్వరం మీది పోరాటం మాది" అనే నినాదంతో రాష్ట్రమంతా ప్రచురితమవుతున్న **"అంగన్‌వాడీ వాయిస్"** సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు చాలా జిల్లాల నుండి చాలామంది పాఠకులు వార్షిక చందా చెల్లించి పత్రికను క్రమం తప్పకుండా పొందుతున్నారు. అయితే చాలామంది పాఠకుల సంవత్సర చందా గడువు ముగిసిపోనుంది. కావున ప్రియ పాఠకులైన మీరంతా మీ వార్షిక చందా గడువును పొడిగించుకోవాలని పత్రికా ముఖంగా తెలియచేస్తున్నాం. సభ్యత్వం రెన్యువల్ చేయించుకోలేని పాఠకులకు పత్రిక పంపబడదు అని గమనించగలరు. పత్రిక తమకు ఎంతో ఉపయుక్తంగా ఉందని ఉత్తరాల ద్వారా, ఫోన్ల ద్వారా, వాట్సాప్ సందేశాల ద్వారా మీ స్పందన తెలియ పరుస్తున్నందుకు ధన్యవాదాలు. మన సమస్యలు మన పత్రిక ద్వారా ప్రభుత్వానికి, ప్రజలకు తెలియచేయటానికి మంచి వేదికగా **"అంగన్‌వాడీ వాయిస్"** నిలుస్తుంది అనటంలో సందేహం లేదు. కావున విజ్ఞులైన పాఠకులు తమ పత్రిక వార్షిక సభ్యత్వాన్ని వెంటనే పునరుద్ధరించుకోవాలని మా మనవి. గమనించండి. చందాను చెక్కుల ద్వారా, డిడిల ద్వారా, ఎంవోల ద్వారా కూడ పంపవచ్చు.

**- ఎడిటర్**

విజయదశమి శుభాకాంక్షలతో...

గత 9 సంవత్సరాలుగా మీ ఆదరాభిమానాలు పొంది వ్యాపార రంగంలో అనుభవం గడించిన

# నిఖిల్ ఎంటర్ ప్రైజస్



## హోమ్ అప్లయిన్సెస్ సేల్స్ & సర్వీస్



ఖాతాదారులకు, మిత్రులకు, శ్రేయోభిలాషులకు
దసరా హృదయపూర్వక కృతజ్ఞతలు




HDB FINANCIAL SERVICES
From the trusted family of HDFC Bank

BAJAJ FINSERV

TVS CREDIT

AMARON
LASTS LONG, REALLY LONG.

యూ.పి.యస్.బ్యాటరీస్ - ఆన్‌లైన్ యూ.పి.యస్ -
బైక్ బ్యాటరీస్ - కార్ బ్యాటరీస్ - ఇన్వర్టర్ బ్యాటరీస్ -
ఎ/సి ఇన్వర్టర్స్ - సోలార్ సిస్టమ్స్ - ఆల్ పవర్ సొల్యూషన్స్

LLOYD



ప్రతి కొనుగోలుపై ఖచ్చితమైన బహుమతి












తక్కువ రేటు.. నమ్మకమైన సర్వీస్











ప్రొ॥ గారపాటి శ్రీనివాస్

లలితా & కో. బిల్డింగ్, మధులత హోటల్ ప్రక్కన, ఆర్.ఆర్.పేట, ఏలూరు
ఫోన్ : 08812-234379, సెల్ సెల్: 9985521789, 8333829999



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA101M102 |
| పుస్తకం పేరు | అంగన్ వాడి |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | Sharmila |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |